# అల్లీబిల్లీలోకంలో అమ్మాయికథ

## 1

వేసంగి సెలవు లిచ్చారు. పాప పొద్దున్నంతా ఆడుకొని అన్నంతిన్నాక తోటలో నీటిదొరువు దగ్గిర మెత్తని గడ్డిమీద దొర్లుతూ, దొర్లువు చుట్టూ చల్లగా ఉన్న చెట్లనీడను, బద్ధకంగా ఒళ్ళు విరుచుకొంటూ కూర్చుంది. కూర్చుని కూర్చుని పాపకు విసుగెత్తుతూంది. కొద్దిగా మధ్యాహ్నపు ఎండకు మగత కూడా వస్తుందేమో అన్నట్టుగా ఉంది.

పక్కనే వాళ్ల అక్కయ్య పుస్తకం చదువుకుంటూంది. పాప ఏమీ తోచక అక్కయ్య చదువుతూన్న పుస్తకంలోకి చూసింది. ఆ పుస్తకంలో బొమ్మలు లేవు. ఓ యిద్దరు మాట్లాడుకొనే మాటలూ లేవు; ఆటలు పాటలూ ఏమీ లేవు; ఏదో అలికేసినట్టు, ఈ చివరినుంచి ఆ చివరిదాకా, చేంతాళ్లలాగా అన్నీ పంక్తులే. "బొమ్మలూ లేక, మాటలూ పాటలూ లేకా, ఏం పుస్తకం, నా మొహం పుస్తకం!" అనుకొంటూ మొహం చిట్లించుకొని పాప అవతలకు జరిగింది.

దొరువులో నీటిఅంచునే, చిన్న చిన్న చేమంతి పూలలాంటి పచ్చనిపూలు ఉన్నాయి. "పోనీ, అవన్నీ

కోసి మాలగా గుచ్చుదామా" అని ఓమాటు అనుకొంది. కాని ఇంతలోనే బద్ధకం తోచినట్లయి, "ఇప్పుడు లేచి అవన్నీ కోస్తేమాత్రం ఏం తోస్తుంది లెద్దూ" అనుకొంటోంది.

లేచి నిల్చోటానికి బద్ధకంగా అనిపిస్తూనే, "పూలు కోద్దామా, వద్దా?" అని మెల్లగా అనుకుంటూ, చుట్టూతా చూసింది.

ఇంతలో ఎక్కడినుంచి వచ్చిందో, ఆ పక్కనుంచి ఓ తెల్లటి కుందేలు, ఎఱ్ఱటి కళ్లేసుకొని, హడావుడిగా పరుగెత్తుతూ, "అయ్యయ్యయ్యో! హవ్వ! హవ్వ! హవ్వ! అయ్యో కర్మమా! ఇంత ఆలస్యమయిపోయిందేమిటి? ఎంత ఆలస్యమయిపోయిందో?" అని గొణుగుకొంటూ గబగబా గంతులేసుకొంటూ పోతోంది.

కుందేలు మాట్లాడట మేమిటా అనన్నా అప్పుడు పాపకు అనిపించలేదు. ఏమంత ఆశ్చర్యము తోచలేదు (తరువాత ఎప్పుడో పాపకు అనిపించింది, కుందేలు మాట్లాడటం ఏమిటా అని).

కాని ఇంతలో ఆ కుందేలు ఒక్క క్షణం నిలబడి చొక్కాజేబులోంచి జేబుగడియారం తీసి, టైము చూసి మళ్లీ గడియారం జేబులో పెట్టుకొని గెంతుకుంటూ పోయింది.

కుందేలు మాట్లాడటం మామూలుగానే అనిపించినా, కుందేలుకు చొక్కాజేబు, అందులో గడి

యారం ఉండటం పాపకు వింతగా అనిపించి, ఏమిటో చూడాలని కుతూహలంతో, ఒక్క గంతేసి, కుందేలువెంట పరుగెత్తింది. తోటలుదాటి పొలాలుదాటి కుందేలు పరిగెత్తిపోతోంది. పాప కూడా కుందేటి వెనకాలే పరుగెత్తుతోంది.

పరిగెత్తి పరిగెత్తి కుందేలు చటుక్కున ఒక్క పొదమాటున ఉన్న బొరియలో దూరింది. పాప కూడా కుందేలు దాటిపోతోందని గబాలున ఆ బొరియలోకి దూకింది. "మళ్లీ వెనక్కి ఎట్లా వస్తామా ?" అనన్నా ఆలోచించుకోలేదు.

ఆ బొరియలోంచి ఒక సొరంగంలాగా దోవ పోతోంది. అల్లంతదూరాన పరుగెత్తుతూ కుందేలు మాయమవుతూంది. పాపకూడా ముందూ వెనుకా చూసుకోకుండానే సొరంగంగుండా పరుగెత్తటం మొదలెట్టింది.

పాప అల్లా పరుగెత్తుతుండగానే అకస్మాత్తుగా కాళ్ల క్రింద సొరంగం ఆఖరైపోయి, ఒక అగాధ మయిన నూతిలోనుంచి గాలిలో క్రిందకు పడిపోటం మొదలుపెట్టింది.

పాప కాస్త జాగ్రత్త తెచ్చుకొని చూసేటప్ప టికే, తాను గాలిలో క్రిందకు పడిపోతున్నానని తెలి సింది. క్రిందకు చూస్తే కటికచీకటి. అట్ట అడుగు ఎక్కడుందో ఏమీ కనబడటంలేదు.

కాని పాపకు, తాను హఠాత్తుగా పడిపోతున్నట్లు కాకుండా, గాలిలో నెమ్మదిగా క్రిందకు దిగుతూన్నట్లే అనిపించింది. కారణం, ఆ నూతికి అడుగూ, పాతాళం ఏమీ లేనందువల్లో, లేక తను నిజంగానే చేతయినట్టు నెమ్మదిగా క్రిందికి పడుతూండటం వల్లో పాపకు తెలియలేదు. అన్నీ చూసుకొంటూ అల్లా గాలిలో దిగేందుకు చాలా తీరుబడి ఉన్నట్టుగానే కనబడింది.

అడుగు కనబడకపోయేటప్పటికి, నూతిలోపలి అంచులకేసి ఇటూ అటూ చూసింది. నూతి అంచులోపల పొడూగునా అలమార్లు, గూళ్లు, అద్దాలు లేని బీర్వాలు అమర్చినట్లుగా క్రిందిదాకా ఉన్నాయి. ఆ అలమారు సొరుగుల నిండా పుస్తకాలు, కలందానులు, పంచదారడబ్బాలు చాకలేట్లు, పిప్పర్మెంట్లు గప్‌చిప్‌లు, బొమ్మలూ, ఫోటోలు—ఎన్నో ఉన్నాయి. గాజుబాడీలూ, గాజుడబ్బాలు, తియ్యతియ్యటి పేర్లున్నవన్నీ అలమార్లనిండా కనబడ్డాయి.

ఒక గాజుసీసామీద 'గుల్‌కంద' అని వ్రాసి ఉంది. పాప మునుపు ఒకసారి అక్కయ్యతో బజారుకు వెళ్ళినప్పుడు గులాబిరేకులతో తియ్యగాఉన్న గులకంద తింది. ఇప్పుడు కనబడ్డ సీసాకూడా కొత్త కొత్త తియ్యమందుల సీసాలలాగా ఎంచక్కా ఉంది. అల్లా పడిపోతూనే పాప ఒకచేత్తో గబుక్కున ఆ సీసా తీసి మూత తీసి చూసింది. తీరాచూస్తే అది కాళీ సీసా!

పాప మొహం చిట్లించుకొని, సీసా మూత పెట్టేసింది. కిందకు వదిలేద్దామా అనుకొంది. కాని కింద ఎవళ్ళ నెత్తినైనా పడుతుందేమో ననుకొని, మళ్ళీ అల్లా గాలిలో క్రిందకి దిగుతూనే పక్కన ఒక అలమారుపారుగులో పెట్టేసింది. పెట్టేసి "మన ఇళ్ళలో పారేసిన సీసాలన్నీ ఇక్కడ ఉంటాయి కాబోలు" అనుకొంది.

పాప ఇంకా అల్లాగే క్రిందికి పడిపోతోంది.

"ఇంత ఎత్తునుంచి పడ్డాక ఇంక ఎక్కడనుంచి పడ్డా నాకేమీ భయమే లేదు! మేడమెట్లమీదినుంచి పడటం ఓ లెక్కా! ఇంటిదగ్గరంతా 'అమ్మో! పాప కెంత ధైర్యం ఉందో!' అని అనుకోరూ? అసలు ఇంటిపై నడికప్పుమీదనుంచి కిందకి పడ్డా సరే, 'కి' మ్మనైనా అనను." (అల్లా పడితే 'కి'మ్మన దన్న మాటా నిజమే) అని పాప తనకు తాను అనుకోటం మొదలుపెట్టింది.

ఇంకా అల్లాగే కిందికి, కిందికి, కిందికి, కిందికి పడిపోతోనే ఉంది. ఆ పటాన్న పాప గట్టిగా మాట్లా డుకోవటం మొదలుపెట్టింది.

"ఏమిటీ! ఇంక ఈ పడట్టానికి అంతం ఉండదా! ఇప్పటి కెన్ని మైళ్ళు పడ్డానో! ఈ పాటికి భూమి మధ్యకి వచ్చేసి ఉంటాను. అంటే చెప్తానుండు; భూమి మధ్య అంటే నాలుగువేల మైళ్లు కాదూ! (మరి పాప స్కూల్లో జాగ్రఫీ చదువుకొందిగా! మొదట్లో

లెఖ్కలూ, తెలుగూ తప్ప జాగ్రఫీ రాని మ సిలిమాస్టరుం టే ఆయన్ని తీసేసి, జాగ్రఫీ వచ్చిన పంతులమ్మను వాళ్ల క్లాసుకు వేశారు. ఆ పాఠాలు పాపకు వచ్చు. ఇప్పుడు తనకు తెలిసినవి బైటపెట్టుతూంటే వినేవాళ్లెవళ్లూ లేకపోయినా, అసలు అలవాటు చేసుకోటం మంచిదిగా? ఈమాటు ఎవళ్లన్నా ఉన్నప్పుడు సుళువుగా చెప్పొచ్చును—అని పాప తన తెలివంతా వెళ్లబోస్తోనే ఉంది.)

"అవును, నాలుగు వేలమైళ్ళే రైటు. మరి అయితే, ఏ లాంగిట్యూడ్, లాటిట్యూడ్‌లో ఉన్నానో?"

(పాపకు లాంగిట్యూడేమిటో, లాటిట్యూడేమిటో అసలే తెలియదు. అయినా ఆ మాటలు అంటూంటే ఓమాదిరి గొప్పగా, హుందాగా ఉంటుందని పాప ఊహ.)

పాప మళ్లీ మాటలు సాగించింది. "బహుశా, ఇల్లా పడిపోయి పడిపోయి భూమి అవతలివైపున బైటికొచ్చేస్తానేమో! దా న్నేమిటీ అంటారు?—అరెమికా!"

(తాను ఏదో తప్పు మాట్లాడానని గ్రహించుకొని, అల్లా పడుతూనే, ఎవళ్లూ తన తప్పు కనుక్కోలేదుకదా అని, ఇటూ అటూ చూసి ఎవళ్లూ లేర్లని తృప్తిపడింది.)

"అయినా అదేం దేశమో, ఆస్ట్రేలియా ఏమో! అక్కడ తలతో నడుస్తారు గాబోలు! అక్కడి వాళ్ల నడిగితే? 'ఏమండీ! నమస్కారం'—(పాప అల్లా పడుతూనే వంగి నమస్కారం పెట్టాన్నట్టుగా వంగి చేతులు జోడించింది)—'ఇదేం దేశమండీ? ఆస్ట్రేలియా లేక న్యూజీలాండా?" అని - "ఆ! ఛా, ఛా! అల్లా అడిగితే ఏమీ తెలియని మొద్దమ్మాయి ననుకోరూ? ఎందుకూ ఎక్కడో బోర్డుమీద పేరు రాసేఉండదా ఏమిటి? చూస్తే అదే తెలుస్తుంది."

అల్లా ఇంకా కిందికి పడిపోతోనే ఉంది. మళ్ళీ పాపకు తోచటంలేదు. ఒంటరిగా వెళ్తూన్నప్పుడు గట్టిగా మాట్లాడుకొనే అందరి పిల్లల్లాగే పాప మళ్లీ మాటలు మొదలుపెట్టింది.

"ఇప్పుడు దీన ఉంటే ఎంతో బాగుండును కదా!" (దీన, పాప పెంపుడు పిల్లి) "పాపం, దీన కీరాత్రి ఎవళ్ళైనా అన్నమూ, పాలూ పెడ్తారో లేదో! నాకోసం ఎంత బెంగెట్టుకొంటుందో! దీనా! నువ్వు కూడా నాతో ఇక్కడుంటే ఎంచక్కా ఉండును. ఇక్కడ గాలిలో నువ్వు పట్టుకొనేందుకు ఎలుకలు లేవనుకో. అయినా ఇక్కడ గాలిలో గబ్బిలాయి లుంటాయిగా. దీనోయ్! గబ్బిలాయిలు కూడా అచ్చు ఎలుకల్లాగే ఉంటాయి. నువ్వెట్టే ఒక గబ్బిలాయిని పట్టుకోవచ్చు - అయితే, పిల్లులు గబ్బిలాయిల్ని తింటాయా?"

ఇంతదాకా మాట్లాడేటప్పటికి పాపకి కాస్త మగత రావటం మొదలుపెట్టింది. అల్లాగే తనలో తాను వరుసగా "పిల్లులు గబ్బిలాయిల్ని తింటాయా? పిల్లులు గబ్బిలాయిల్ని తింటాయా?" అంటూనే, మధ్యమధ్య "గబ్బిలాయిలు పిల్లుల్ని తింటాయా, పిల్లులు గబ్బిలాయిల్ని తింటాయా, గబ్బిలాయిలు పిల్లుల్ని తింటాయా" అని తిరగామరగా అనుకోటం మొదలుపెట్టింది. అసలు ఏ ప్రశ్నకూ పాపకు సమాధానం తెలియదు కాబట్టి ఎల్లా అనుకొన్నా ఫరవాలేకపోయింది.

కాస్త కునుకు వచ్చినట్లయి పాపకు కల వచ్చింది. ఆ కలలో దీనా, తనూ, చెట్టాపట్టాల్ వేసుకొని పక్కపక్కనే పోతున్నారు. పిల్లిని తను చాలా శ్రద్ధగా అడుగుతోంది : "అయితే దీనా! నిజం చెప్పు! నువ్వెప్పుడైనా గబ్బిలాయిని తిన్నావా" అని.

అల్లా అడుగుతూ ఉండగానే, ధనధనా మని తను ఒక ఎండు ఆకుల గుట్టమీద పడి తెలివి వచ్చింది.

పాపకు ఏమీ దెబ్బ తగులలేదు. చుట్టూ చూసింది. అంతా కటికచీకటి. ముందుమాత్రం మళ్ళీ ఒక సొరంగం ఉంది. దూరాన ఆ సొరంగంలో పరుగెత్తుతూ మళ్ళీ ఇందాకటి తెల్లకుందేలు కనబడింది.

ఒక్క గంతేసి ఒంటిమీద ఎండుఆకులు దులుపుకొంటూ, ఇంకో క్షణంకూడా ఆలస్యం చేయకూడ

దనుకొని, పాప మల్లీ కుందేలు వెంట పరుగెత్తింది. ఒక మలుపు దగ్గరకు వచ్చేటప్పటికి కుందేలు ఇంకా గొణుగుకొంటూన్న మాటలు వినబడ్డాన్నాయి. "అయ్యో, నా తెలివి తెల్లారా! అయ్యో, నా మొహం ఈడ్వా! అయ్యో, నా చెవులు చిన్నవై పోనూ! ఇంత ఆలస్యమైపోయింది, హాయ్యో, హాయ్యో!" అంటూ కుందేలు మలుపు తిరిగి పరుగెత్తింది.

పాప కూడా పరుగెత్తి మలుపు తిరిగింది. కాని, కుందేలు కనబడనే లేదు. వెనక్కి చూస్తే తను వచ్చిన దోవే మల్లీ తనకు కనబడలేదు. పాప తెల్ల బోతూ నిల్చుంది.

## 2

పాప మల్లీ ఒకసారి చుట్టూ కలయ చూసింది. చూస్తే తానొక పొడుగుపాటి హాల్లో ఉంది. మరి హాల్లోకి తను ఏమలుపు తిరిగి వచ్చిందో, ఆ మలుపు ఎక్కడా కనబడటం లేదు.

ఆ హాలు ఈ మూలనుంచి ఆ మూలదాకా ఒక్కటే పొడుగు. హాలంతో అంతటా పైనుంచి, గాజు పలకల గొలుసులకు వేళ్లాడుతూ, గాజుకుప్పెల్లో దీపా లున్నాయి. గాజు కుప్పెల చుట్టూ తళతళ లాడుతూ, బిల్లోరీ గాజుపలకలు నిలువునరాలు గుచ్చి నట్టు అలంకారంగా ఉన్నాయి. గాజు కుప్పెలో

దీపాలు, కొవ్వొవత్తులో, కొత్త నక్షత్రాలో, మణి దీపాలో, (పాపకు మణిదీపా లేమిటో తెలియవు కాని, తళుకు తళుకు మంటూ మణులే నక్షత్రాల లాగా మెరుస్తూ దీపాలై ఉంటాయేమో అని అనుకొనేది) మరి ఇం కేదీపాలో ఏమో తెలియ లేదు. హాలు మాత్రం తను కథల్లో చదువుకొన్న రాణుల అంతః పురం గదిలాగా ఉంది. కాని హాలులో వెలుగు మాత్రం నక్షత్రాల వెలుగులాగా గుడ్డి గుడ్డిగానే ఉంది.

గోడల వెంటే పోతూగునా నడిచింది. గోడల నిండా తలుపులూ ద్వారబంధాలే. అన్నీ చిత్ర చిత్రంగా ఉన్నాయి. కాని ఒక్కతలుపూ తీసి లేదు. హాలుచుట్టూ గోడల వెంటే నడిచి నడిచి ప్రతితలుపూ తోసి, చూసింది. అన్ని తాళాలు వేసే ఉన్నాయి. నడిచి నడిచి చివరకు మళ్ళీ మొదటి కొచ్చింది.

పాప "ఎవరన్నా ఉన్నారా ?" అని గట్టిగా ఒక కేక పెట్టింది. ఆ గోడల మూలలు నాలుగూ, "ఎవరన్నా ఉన్నారా ?" అని మళ్ళీ పాపనే అడి గాయి.

విసుగుతో, విచారంతో హాలుమధ్యకు నడి చింది. ఇక్కడనుంచి బైటపడటం ఎల్లాగా అని ఆశ్చర్యపోతూ ఆలోచించుకొంటూ తల వాల్చుకొని నడుస్తూంది.

హాలుమధ్యలో చటుక్కున ఒక గుండ్రని మేజాబల్ల కనబడింది. ఇందాక తలుపులు చూడటం ధోరణిలో, తనే ఆబల్ల చూడలేదో, లేక నిజంగా ఆ బల్ల అక్కడ లేదో, పాపకు ఎంత ఆలోచించినా జ్ఞాపకానికి రాలేదు. ఆ మేజాబల్ల, సరిగ్గా మూడడుగులే ఎత్తుంది. బల్లబల్ల అంతా, కాళ్ళతో సహా క్రిందినుంచి పైదాకా పూర్తిగా గట్టి గాజుతో తయారు చేసిందిగా ఉంది. బల్లమీద ఎక్కడ చెయ్యి వేసినా నున్నగా జారిపోతూ ఉంది.

ఆ గుండ్రని మేజాబల్ల నడుమన, పాపకు ఒక చిన్న బంగారపు తాళంచెవి కనబడింది.

పాప ఉత్సాహంతో ఆ తాళంచెవి తీసుకొని, గోడలపొడుగునా ఉన్న తలుపుల్లో దేనికన్నా ఈ తాళంచెవి పట్టుతుందేమో నని పరుగెత్తి చూచింది. కాని పాపం, ఎన్ని తలుపులు చూసినా, తాళాలు పెద్ద వవటంవల్లో, తాళంచెవి చిన్నదవటంవల్లో, తాళాలు రానేలేదు. అన్ని తలుపులూ ప్రయత్నించి చూసింది. కాని, లాభం లేకపోయింది. పాపం ఒక్కటీ రాలే!

ఒక చుట్టు తిరిగి తలుపులన్నీ తోసి చూసింది. మళ్ళీ ఆ తాళంచెవితోటే రెండోమాటు ప్రదక్షిణం బయలుదేరింది. ఈమాటూ తలుపులు రాలేదు.

కానీ ఈమాటు పాపకు ఒకచోట, గోడ దిగువంచున వేళ్ళాడుతూ, ఒక చిన్న పట్టుతెర కన్పిం

చింది. ఆ తెర తీస్తే, తెర వెనకాలే, ఒక మూరెడెత్తు తలుపు ఒకటి ఉంది.

ఈమాటు తాళంచెవితో ఈ చిన్న తలుపు తాళం తెరుచుకొనేటప్పటికి పాపకు పరమానందం అయిపోయింది.

తలుపు తీసి చూస్తే, ఆ తలుపు నుంచీ వెళ్ళే దోవ అంతకన్నా కూడా మరీ చిన్నదిగా ఉంది. అసలు ఎలుక కన్నంకంటె పెద్దదిగానన్నా కనబడ లేదు.

పాప మోకాళ్లమీద ముందుకు వంగి, ఆ కన్నంలోంచి చూసింది. ఆ కన్నంలోంచి చూస్తూంటే బైట కన్నం అవతల, ఒక చక్కని తోట కనబడు తూంది. తోట అంతా దివ్యంగా వెలుగుతూన్నట్లుంది. అంటు మామిడి పళ్లు, దోరజామపళ్లు, అనాస పళ్లు, దానిమ్మ పళ్లు, ద్రాక్ష—ఒకటేమిటి, అన్ని రకాల చక్క చక్కనిపళ్లూ, మల్లెలు, సంపెంగలు, గులాబీలు, మొదలైన అన్ని రకాల పూవులూ ఉండి, తోట ఎంతో బాగా కనబడుతూంది. మొక్కలకు మధ్య మధ్య రకరకాల రంగులతో మెరిసిపోతూ వానజల్లు కురుస్తూన్నట్లు నీటిధారలు చుట్టూ వెదజల్లుతూ బొమ్మలతో ఉన్న జలయంత్రాలూ, వాటి చుట్టూ చిన్ని చిన్ని బొమ్మలకోటలూ అన్నీ కనబడు తున్నాయి.

పాప తను ఆ దోవలోనుంచి బైటికి పోవటం ఎల్లాగా అనుకొంటూ, ఆ చిన్ని గుమ్మందగ్గరగానే నేల బారుగా వంగి చూస్తూ ఆలోచిస్తోంది. ఒకవేళ తల దూర్చవచ్చు నేమో తలదూర్చినా భుజా లెల్లా పడతాయి? భుజాలూ అవీ ఏవీ పట్టకపోయాక తల ఒక్కటీ విడిగా దూరిమాత్రం ఏం లాభం? "ఆహా! సింహికనోట్లో దూరిన ఆంజనేయులవారిలాగా చిన్నదాన్నవగలిగితే ఎంత బాగుండేది! (పాప, హనుమంతుడి కధ అక్కయ్య చెప్పితే విందిగా!) అసలు అవచ్చేమో! అవటం ఎల్లాగో తెలిస్తే బాగుండును. ఏదయినా అంతేగా, తెలిస్తే ఏముంది, కూసు విద్యేగా!" అనుకొంది.

ఎల్లా చిన్నదాన్నైపోవటం అసంభవం కాదా అని పాప, అనుకోలేదు. ఆ వేళ జరిగిందంతా చూస్తుంటే, ఎంతెంతో అద్భుతం అనుకొనేది కూడా. ఇట్టే జరుగవచ్చుననే పాపకు అనిపించింది.

కాసేపు ఆంజనేయదండకం చదవడం మొదలెట్టింది. కాని మొదటి నాలుగుముక్కలతోనే దండకం చదువు ఆఖరైపోయింది. తను చిన్నది కాలేదు.

"ఇక్కడ చూస్తూ, గుమ్మం కాచుకొని నిరాశ చేసుకొంటూ కూర్చుంటే ఏం లాభం ఉంది? మళ్లీ వెళ్లి చూస్తే బల్లమీద ఇంకో తాళంచెవి ఏదైనా దొరకుతుం దేమో! లేకపోతే, ఆంజనేయులులాగ చిన్నదాన్నైపోవటం ఎలాగో ఆ పద్ధతంతా తెలిపే

పుస్తకం ఏమన్నా ఉంటుందేమో ?" అనుకొంటూ లేచి, పాప మళ్లీ గుండ్రబల్లదగ్గిరకు నడిచింది.

ఈమాటు బల్లమీద ఒక చిన్న సీసా బిర డాతో కనబడింది. "ఈ సీసా ఇందాక ఇక్కడ లేందే !" అని నిశ్చయం చేసుకొంటూ పాప ఆశ్చర్య పోయింది.

ఆ సీసా చుట్టూ నీటుగా ఒక రంగు కాగితం, ఆ కాగితంమీద పెద్ద అచ్చులో "నన్ను తాగు" అని స్పష్టంగా వ్రాసిన అక్షరాలూ ఉన్నాయి.

"సరేలే ! తాగమంటానికేం ! తేలికగానే చెప్పొచ్చు. "నన్ను తాగూ" అని. నాలాంటి తెలి వైన పిల్ల, ఊర్కే చెప్పేదుమాటలు విని మోస పోతుందా ఏమిటి ? మొన్న ఈమధ్య మత్తుమిఠాయి పెట్టేవాళ్లు వచ్చారనీ, ఎవళ్లన్నా, ఏదన్నా, అల్లా ఇస్తే, అడావుడిగా తీసుకు తినొద్దనీ అమ్మ చెప్పలే ! తొందరపడి తాగటంకన్నా ముందు మత్తుమందో, విషమో చూడొద్దూ ! (పాప వాళ్ల యింటి డాక్టరు గారి దగ్గిర విషం అని వ్రాసిఉన్న సీసాలు ఉండటం చూసింది. అల్లా రాసి ఉంటే తాగకూడదని ఆయన పాపతో చెప్పారు.) సీసామీద ఎక్కడన్నా 'విషం', 'మత్తుమందు' అని వ్రాసిఉందేమో ముందు చూడాలి" అనుకొంది. ఇల్లాంటి చిన్నచిన్న విషయాలు మరిచి పోటంవల్లే, ఎంతోమంది పిల్లలను, రాక్షసులు ఎత్తుకు పోయారనీ, తోడేళ్లు, పులులూ అల్లాంటివి మింగేశా

యనీ, ఇంకా ఎన్నెన్నో కష్టాలొచ్చాయనీ, పాప ఎన్నెన్నో కథలు వింది, చదువుకొంది కూడా! అందుకని ఆ సీసా చేత్తో పుచ్చుకొని, ఎక్కడైనా 'విషం' అని వ్రాసివుందేమో అని అతి జాగ్రత్తగా పరీక్ష చేసి చూసింది. సీసామీద ఎక్కడా విషం అని వ్రాసిలేదు.

కాసేపు అల్లాగే చూసి చివరకు బిరడా తీసి, జాగ్రత్తగా ఒక చుక్క అరచేతిలో వేసికొని, భయం భయంగా రుచిచూసింది.

ఆ ఒక్క చుక్క రుచిచూస్తేనే అమృతంలా గుంది. పాపకు కమ్మని జీడిపప్పు సేమ్యాపాయసం, తేనే, ఘుమఘుమలాడే మామిడిపళ్లరసమూ, ద్రాక్ష రసం, అనాసముక్కల రసము, పనసతొనల రుచీ, గులాబ్ జామ్ పాకం, ఒకటేమిటి?-ఇంకా ఎన్నెన్నో కమ్మని, రుచులూ, వాసనలూ, అన్నీ ఆ ద్రావ కంలో కలిపేసివున్న రుచి కలిగింది. పాప సీసా ఎత్తి, సీసాడు ద్రావకమూ తాగేసింది.

"ఇదేమిటీ! గమ్మత్తుగా ముడుచుకుపోతున్నా ననిపిస్తోందే! హనుమంతుడిలాగే చిన్నిదాన్నయి పోతున్నానే! హనుమంతుడికి ఆ రాక్షసి అడ్డు వచ్చి నప్పుడు, ఈ మందే దొరికినది కాబోలు!"

పాప నిజంగా కూడా అల్లాగే చిన్నది చిన్న దిగా ఐపోతోంది. అల్లా చిన్నచిన్నగా అయిపోతూ పది అంగుళాల ఎత్తులోకి వచ్చేసింది.

"ఇంత ఉంటే, సరిగ్గా, ఆ తలుపులోంచి వెళ్ళొచ్చు" ననుకొంది. "అయినా ఇంతతో ఆగుతానో, ఇంకా చిన్నదాన్నయిపోతానో; ఇల్లా తగ్గిపోయి తగ్గిపోయి చివరికి కొవ్వొత్తిదీపంలాగా మాయమైపోతానో ఏమో! కొవ్వొత్తిదీపం ఆఖరున ఎల్లా ఉంటుందో, ఎప్పుడూ చూడనేలేదే! ఈమాటు చూడాలి!" అనుకొంటూ, కొవ్వొత్తిదీపం అంతా కరిగిపోయి, దీపం పూర్తిగా మాయమైపోయాక ఎల్లా ఉంటుందో ఊహించుకోటం మొదలుపెట్టింది.

కాసేపు అల్లా ఆలోచించుకొంటూ ఆగి మళ్ళీ చూసుకొంటే, తను అంతకంటె చిన్నదవలేదు. ఆ ఎత్తునే ఉంది.

పాప సంతోషంతో తలుపు దగ్గరకు వెళ్ళింది. కాని, పాపం! చూసేటప్పటికి తలుపు వేసి ఉంది.

అప్పుడు పాపకు జ్ఞాపకం వచ్చింది – ఇందాక తలుపుదగ్గరనుంచి లేచేటప్పుడే, ఏమరుపాటున తలుపు తాళం వేసి, బంగారంతాళంచెవి బల్లమీద పెట్టానని.

"అయ్యో! నా తెలివి తెల్లారినట్టే ఉంది." అనుకొంటూ (పాపకు పెద్దవాళ్ళనుకునే మాటలే అర్థం తెలియకపోయినా, అలవాటయాయి.) అనుకొంటూ బల్లదగ్గిరకు నడిచింది.

తీరా చూస్తే, ఇప్పుడు బల్ల తనకంటే చాలా ఎత్తుగా ఉంది. బల్ల అడుగుకోళ్ళ ఎత్తుకైనా తను రాలేదు. ఆ కోడు వెంబడే పైకి పాకుదామని ప్రయ

త్నించింది. కాని మేజాబల్ల అడుగుకోళ్లు కూడా గాజు వేగా మరి నున్నగా జారిపోతూ, ఎక్కటానికి పట్టు అందకుండా ఉన్నాయి. అందకుండా అల్లా ఎత్తుగా బల్ల మీద ఉన్న, తాళంచెవి తీసుకోటం ఎలాగో పాపకు తోచలేదు. ఎన్నిమార్లు కోళ్లమీదుగా పైకి పాకుదామన్నా, కాళ్లు జారిపోతోనే వచ్చాయి.

ప్రయత్నించి ప్రయత్నించి, విసుగెత్తి, చివరకు క్రింద కూలబడిపోయి ఏడవటం మొదలుపెట్టింది.

ఇంతలోనే "సరేలే! ఇం కేడుపు చాలించు" అంటూ తనను తనే కోప్పడుకోవటం మొదలు పెట్టింది. కాని లోపల ఎల్లా కోప్పడుకొంటూన్నా నోటివెంబడి ఏడుపు అల్లా వస్తూనే ఉంది. "ఊఁ, ఇక చాలు! ఏడవకు, చెప్తొంటే నీకుగాదూ? మానెయ్ ముందు. ఊ! మానేస్తావా, లేదా?" అని తన అమ్మ కోప్పడినట్లుగా తనని తనే కోప్పడుకొంది.

అసలు ఎప్పుడూ అల్లా తనను తను కోప్పడు కొంటూ బుద్ధిచెప్పుకోటం పాపకు అలవాటే! ఎందుకూ, ఒక్కొక్కప్పుడు కళ్లనీళ్లు వచ్చేదాకా తనను తనే తిట్టుకొనేది. ఒకసారి ఒక్కతే కూర్చుని చింతగింజలాడుకొంటూ, కాయ కంగినా, కంగనట్టు చూసి, అన్యాయం ఆడినందుకు, తనకు తానే బుద్ధి చెప్పుకొంటూ, బుగ్గలు కమిలిపోయేలాగా గట్టిగా పిండేసుకొంది. అల్లా ఎప్పటికప్పుడు తనలోనే తనుఇద్దరి

లాగా - ఒకళ్లు తప్పు చేసినవాళ్లు, ఒకళ్లు చీవాట్లు పెట్టేవాళ్లలాగా - అనుకోటం పాపకు సరదా!

కాని పాపం ఇప్పుడా సరదాకు ఏమీ అర్థమూ లేదు, ప్రయోజనమూ లేదనిపించింది.

"సరేలే! ఇప్పు డిద్దరిలాగా నటిస్తే ఏం లాభం? అసలు ఘరానాగా ఒక్కళ్ళని చెప్పు కొనేందుకే చాలినంత మనిషినే లేనాయెను. ఇంక ఇద్ద రున్నట్టు నటించుకోటం ఏమిటీ, తెలివితక్కువ? చాల్చాలు!"

పాప అల్లా కూర్చుని బల్లక్రిందికి చూసింది.

బల్లక్రింద గాజుపళ్లెంలో, ఒకరొట్టె కనబడింది. ఆ రొట్టెపైనంతా, పంచదారపాకంతో రంగురంగుల లతలు చెక్కి ఉన్నాయి. ఆ లతల మధ్య "నన్ను తిను" అని అక్షరాలు స్పష్టంగా కనపడుతున్నాయి.

ఈమాటు పాపకు సందేహించాల్సిన జాగ్రత్తే అవసరమని తోచలేదు.

"సరే తింటాను! పొడుగయినా, తాళంచెవి అందుతుంది. లేదూ, ఇంకా పొట్టిగా అయిపోయానా ఆ తలుపు అడుగు సందులోంచి దూరి అవతలకి పోవచ్చు." అనుకొంటూ పాప రొట్టె ఒకమూల కాస్త కొరికింది.

కొరుకుతూనే అరచెయ్యి నెత్తిమీద పెట్టుకొని "ఎటూ? పైకా? కిందికా? పైకా కిందికా? ఎదుగుతూ న్నానా? కుంగుతూన్నానా?" అంటూ ఆదుర్దాగా

చూసుకోటం మొదలు పెట్టింది. కాని అల్లా చేత్తో చూసుకుంటే చెయ్యి నెత్తి కంటుకొనే ఉంది తప్ప పొడుగవుతూందీ, పొట్టిఅవుతూందీ, పాప కేమీా తెలియలేదు. పాపకు ఆశ్చర్యం వెయ్యటం మొదలు పెట్టింది. ఎందుకంటే, తప్పకుండా పొడుగో, పొట్టో అయితీర్తాననే నమ్మింది. అందుచేత ఏమీా అవకుండా అల్లాగే ఉన్నా ననుకొనే టప్పటికి ఇన్ని వింత విషయాలకు అలవాటుపడ్డ అమ్మాయికి, మామూలు ధోరణిలో ఏదో బండగా జీవితం జరగ టం—అంటే రొట్టె తింటే పొట్టీ, పొడుగూ అవక పోవటం—పాపకు ఆశ్చర్యంగానే అని పించింది.

అయినా తింటం ఎలాగా మొదలుపెట్టిందిగా! పాప రొట్టె పూర్తిగా తినేసింది.

## 3

"అయే! అయే! బయే గోమ్మత్తుగా ఉందే!"

పాపకు ఆశ్చర్యం పట్టలేక గబుక్కున ఒక్క సారి ముద్ద మాటలు నోటివెంబడి వచ్చేశాయి.

"ఏంతీ! మలీ పే-ప-ప-ద్దదాన్నయి పోతు న్నాను—అయ్యో, ఎంతయి పోయానో! పాదా లేవీ? అయ్యో, పాదాలా!"

(పాప కాళ్ళవంక చూసుకుంటే పాదా లెక్కడో, కంటిచూపుకే అంద నంత అపొగున ఉన్నట్టున్నాయి)

"అయ్యో పాపం! నా పాదాలు ఎంతదూర మయిపోయాయో ! ఇంక వాట్లకి పసుపూ పారాణీ ఎవరు రాస్తారు ? పాంజేబు పట్టాలు ఎవళ్ళు తొడుగు తారు ? నేనేం చెయ్యటానికి ఇంత దూరమై పోయా నాయెను, వీలే పడదుకదా ! అయ్యో పిచ్చిపాదాలా! ఇంక మీసంగతి ఎవళ్ళు చూస్తారమ్మా ? ఇంక మీ దోవ మీరే చూసుకోవాలి కదా !—అయినా నేను కాస్త వాటిని మంచితనం చేసుకొని దయగా ఉండక పోతే, బహుశా నేను చెప్పినట్టు నడవక, వాట్లదోవ నవి పోవూ ? వీట్లను మంచి చేసుకోవటం ఎల్లా ? చూస్తానుండు. రేపు శ్రావణ శుక్రవారం నాటికి, కొత్త పాంజేబు పట్టాలు కొని వాట్లకు బహుమతి ఇస్తా... నే నియ్యటం ఎల్లా ? బంగీకట్టి పంపించాలి. అడ్రెసు ఏమని రాయాలో!

"శ్రీ పాప కుడిపాదంగారికి, తివాసీపేట,

(గుండ్రబల్ల ప్రక్కన)

—పాప ముద్దులతో పంపించినవి, అని రాయాలి గాబోలు!

"ఛా! ఏమిటీ అవకతవక వాగుడూ, నేనూను?". ఇల్లా అనుకొంటూండగానే పాపకు ఆహాలుడా బ్రా కప్పు లోపలివాసాలు ఠక్కున నెత్తికి తగిలాయి. అసలు ఇప్పటికే పాప తొమ్మిది అడుగుల ఎత్తు ఎదిగి పోయింది.

వెంటనే బంగారపు తాళంచెవి బల్లమీద నుంచి, చేతిలోకి ఎగరేసుకొని, తోటలో కెళ్ళే, తలుపు దగ్గిరకు పరుగెత్తింది.

కాని పాపం! ఎంత వంగి, వంగి పాకుతూ న్నట్టు నేలమీద పడుకొని, మొహం కిందికి పెట్టి, తోటకేసి చూద్దామన్నా తలుపుద్వారం, ఒక కంటికి సరిగ్గా కనబడేటప్పటికే కష్ట మయింది. ఇంక ఆ తలుపులోంచి వెళ్ళటమెలా! అసలే లాభం లేదని పించింది. పాప కూర్చుని ఏడవటం మొదలు పెట్టింది. ఆ ఏడుపులోనే—

"చాల్లే! వెధవ ఏడుపూ, నువ్వూను! దయ్యం లాగ ఇంత పెద్దదాన వయ్యాక కూడా, (నిజానికికూడా పాప యిప్పుడంత పెద్దపిల్లా అయిపోయింది) ఇంకా ఏడుపేనా? తక్షణం ఆపుతావా, లేదా? చెప్తాంటే మ'ను!"

అనుకొంటూందే గాని, ఏడు పాగలేదు. కళ్ళ నీళ్ళు కడవలకొద్దీ బడబడా కురిసిపోతున్నాయి. ఏడు పాగటమే లేదు. కురిసి కురిసి, అల్లా ఆ నీళ్ళతో పాపచుట్టూ జానెడులోతున హాలంతా కళ్ళనీళ్లమడుగు అయిపోయింది.

కాసేపటికి దూరాన ఎక్కణ్నుంచో బుల్లిబుల్లి అడుగుల్తో ఎవరో పరుగెత్తు కొస్తున్న చిరు చప్పుడు అయింది. ఎవళ్లన్నా చూస్తారేమో అని పాప అడా

పుడిగా కళ్ళు తుడిచేసుకొంటూ, ఎవరొస్తున్నారో అని చూసింది.

ఇందాకటి తెల్లకుందేలే! ఈమాటు ఇంకా అలంకారంగా చక్క చక్కని దుస్తులన్నీ వేసుకొంది. ఒక చేతిలో మెరిసిపోతున్న రెండు చిన్న బంగారపు మురుగులూ, ఇంకో చేతిలో తళతళ లాడ్తూ పట్టు కుచ్చులు పడతలు విప్పినట్టున్న ఒక వింజామరము, (దేవుడికి విసిరే విసనకఱ్ఱను వింజామర లంటా రను కొందిపాప) పుచ్చుకొని మళ్ళీ గట్టిగా గొణుగుకొంటూ కీవితోటి అడావుడిగా నడుస్తూ వస్తూంది.

"అయ్యయ్యో! రాణిగారికి కోపం వచ్చేసే ఉంటుంది! అమ్మో! రాణిగారు ఇంక బతకనిస్తుందా? ఇంతసేపు కాచుకు నుంచోవాల్సొస్తే ఆవిడ కాగ్రహం వచ్చేస్తుందిగానీ, ఇంకేమన్నా ఉందా? అయ్యో! అయ్యో!...

పాపకు అంతకు ముందుదాకా ఎవళ్ళూ లేక బెంబే లెత్తిపోయినట్టుంది. ఎవళ్ళతో నైనా సరే మాట్లాడి, ఏదో సలహా తీసుకోకపోతే ఉండబట్ట లేనట్టుగా ఉంది. కాస్త కుందేలు దగ్గరకు రాగానే భయంభయంగా చిన్న గొంతుకతో—

"ఇదుగో, ఏమండోయ్! క్షమించి కాస్త..." అని మొదలుపెట్టింది. మాట ఇంకా పూర్తి కానే లేదు.

కుందేలు అదిరిపోయినట్టు ఒక్క ఎగు రెగిరి, హడిలిపోతూ, ఆ మురుగులూ విసనకఱ్ఱా అక్కడే పారేసి, హాల్లో చీకట్లోకి ఒకటే దౌడు తీసింది.

పాప ఆ మురుగులూ, విసనకఱ్ఱా చేత్తో పుచ్చుకొంది.

హాల్లో ఇరుకుగా ఉన్నట్టయి, వేడెత్తిపోయి, ఉక్క పోస్తున్నట్టుంది. పాప ఆ విసనకఱ్ఱతో చెమట ఆర్చుకొందామని విసురుకోటం మొదలు పెట్టింది. అల్లా విసురుకొంటూనే తనలో తానే గట్టిగా మాట్లాడుకొంటూ కూర్చుంది.

"అరెరే! ఇదేమిటి, ఇవాళన్నీ ఇల్లా తమాషాగా, వింతవింతగా జరుగుతున్నాయి? మళ్ళీ నిన్నటిదాకా అన్నీ మామూలు ప్రకారంగానే జరుగుతూ ఉండేవే! రాత్రికి రాత్రి, నేను గబుక్కున 'ఏమీ మారిపోలేదు కదా? అయినా జ్ఞాపకం చేసుకొని చూస్తానాగు. పొద్దున్న నేను నిద్రలేచేటప్పటికే ఇల్లాగ ఉన్నానా? ఊఁ. ఏదో ఇంకో మాదిరిగా ఉండేదాన్ననే నాకు బాగా జ్ఞాపకం. ఇంతలో ఇంకో అమ్మాయిగా మారిపోయానా? మరి ఇంకో అమ్మాయినే అయితే, ఇప్పుడు నేను నేను కాక ఇంకెవరినన్నమాటా ?"

తను ఎరిగిఉన్న పిల్లల్లో తను ఎవరుగా మారిపోయి ఉండవచ్చా అని, తన ఈడుపిల్లల విషయా

లన్నీ జ్ఞాపకం చేసుకొంటూ తిరగేసుకోటం మొదలు పెట్టింది.

"సీతిని కాను. సీతిజుట్టు, గొర్రె పొట్టేలు బొచ్చులాగా గొగ్గులుగొగ్గులుగా దువ్వెనకు లొంగకుండా బిరుసుగా ఉండి, జడ గొంగళి పురుగులా ఉంటుంది. నా జుట్టు ముంగుర్లు తిరిగి మెత్తగా పట్టుకుచ్చులాగా ఉంటుంది. మరి పోతే, సూరిని కాను - దాని మొహం దాన్నవట మేమిటి? వెంకి ననలే కాను. వెంకి బండ మొద్దు. అయినా వెంకి వెంకే, నేను నేనే. నేను వెంకయితే, వెంకి ఏం కావాలి? అదీ కాకుండా నేను బండమ్మాయినా ఏమిటి?

అసలు నాకొచ్చినవన్నీ జ్ఞాపకం ఉన్నాయో, లేదో చూస్తాను. నాలుగయిదులు పన్నెండు, నాలుగార్లు పదమూడు, నాలు గేళ్లు...ఛా! ఛా ఇదేం ఎక్కం? ఈ లెఖ్ఖని, ఇరవైదాకా రావటమే జన్మకి పడదు. అయినా! వెధవ ఎక్కాలు ఎక్కాల్నిబట్టీ ఏమిటి, తెలివితేటలు చూసుకోటం? పాఠాలు చూసుకోవాలి గాని. ఆవుకు నాలుగు కాళ్లుండును. ఇది సకిలించును. దీని మెడపైనను, తలపైనను పెద్ద కేసరములుండును. ఇది పిల్లిజాతిలోనిది. చెట్లెక్కుటలో గట్టి పట్టు, నేర్పును గలదు. శత్రువులు తరుముకొని వచ్చినప్పుడు ఎడారి ఇసుకలో తన తలను దాచుకొనును. ఉష్ట్రపక్షి యని దీనికి మరో పేరు. ఉష్ట్రపక్షి ఏమిటి? ఆవుపాఠము కాదూ, మొదలెట్టాను? ఛా! ఛా! అన్నీ

తప్పులే వచ్చినట్టున్నాయి. అయ్యయ్యో! అప్పుడే వెంకి నైపోయాను గాబోలురా! అయినా పద్యాలు కూడా రావేమో చదువుకొని చూస్తాను.

పాప రెండు చేతులూ కట్టుకొని, కళ్లు మూసుకొని, పంతులమ్మ దగ్గిర పద్యం అప్పచెప్పుతున్నట్టుగా భయంతో బొంగురుపోయిన గొంతుక పెట్టి అప్ప చెప్పింది.

"ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు
సజ్జనుండు పల్కు చల్లగాను
పిల్లి తిన్న కోడి పిలిచితే పలుకునా,
విశ్వదాభిరామ వినర సుమతీ!"

ఊఁ, కాదు, ఎక్కడో తప్పినట్టే ఉంది! అయ్యో కర్మమా. మొద్దుపిల్ల 'వెంకి' నైపోయే ఉంటాను. వెంకికి ఆడుకొనేందు కేమీ ఇవ్వరు. ఓ మంచి గౌనూ, చొక్కా, పరికిణీ ఏమీ ఉండవు. అస్తమానం చివాట్లూ, చెప్పుదెబ్బలేగా?

ఉహూ! వెంకి నైతే ఇక్కడినుంచి కదలనే కదలను. ఉ! కన్నం దిగ్గిరకు వచ్చి ఎవళ్ళెంత కేక లేసినాసరే కదల్నే కదలను. "అమ్మా, తల్లీ! పైకిరా అమ్మా" అని కేకేసి కేకేసి వాళ్ళ నోళ్లు బద్దలుగొట్టుకోవలసిందే! లాభం లేదు. లేకపోతే, "సరే, రమ్మంటున్నారే! మరి ముందు నే నెవర్తెనో చెప్పండి. మీరు చెప్పిన పిల్లనుగా ఉంటానికి నా కిష్టమైతేనే వస్తాను. లేకపోతే రానే రాను. నాకు కావలసిన

ఇంకో అమ్మాయి నయ్యేదాకా ఇక్కడే ఉంటాను. అందుకని ముం దెవరో చెప్పండి" అని అడుగుతా అంటూనే, పైకి చూసి "అబ్బ! ఎవళ్లన్నా వచ్చి, పోనీ రమ్మనైనా కేకెయ్యరే? ఒక్కతెనే ఎంతసే పిక్కడ పడుండనా ఏమిటి! అబ్బా!" అంటూ ఒక్క సారిగా కళ్లనీళ్లు పొర్లుకొచ్చి ఏడ్చింది.

ఏడుస్తూనే పాప తన చేతులవంక చూసు కొంటే, చేతులు మళ్ళీ చిన్నవై పోయాయి. అల్లా మాట్లాడుకొంటూనే ఎప్పుడో ఇందాక కుందేలు అక్కడ పారేసిపోయిన బంగారుమురుగు ఒకటి తనకు తెలియకుండానే చేతికి తొడుక్కుంది. అంత చిన్న మురుగూ చేతికి సరిగ్గా పట్టింది.

"అయితే మళ్ళీ చిన్నదాన్నయిపోతున్నానే!" అంటూ చటుక్కున లేచి నిలబడి, తనని కొలుచు కుందామని బల్లదగ్గిరకు వెళ్లింది.

అప్పటికి దాదాపు రెండడుగులు ఎత్తుంది. ఇంకా చిన్నదిగా అయిపోతూనే ఉంది. ఏమిటా అని పాప పరకాయించి చూసుకుంటే, విసనకఱ్ఱతో విసు రుకుంటూండటంవల్ల చిన్నదా న్నయిపోతున్నానని తోచింది. చటుక్కున విసనకఱ్ఱ అక్కడ పారేసింది. "నయమే, త్వరగా తెలుసుకున్నాను. బలే గండం తప్పిపోయింది." అనుకొంటూ, తోటకు వెళ్ళే చిన్న ద్వారం దగ్గిరకు పరుగెత్తింది.

కాని పాపం, మళ్ళీ ఆ తలుపు వేసే ఉంది. ఆ బంగారం తాళంచెవి ఇందాకటిలాగే బల్లమీదే ఉంది.

"సరి ! మరీ బాగుంది ! అంతకంతకూ మరీ అఘ్వాన్నమైపోతోంది బతుకు ఇందాకకూడా ఇంత చిన్నదాన్ని అవలేదు. మరీ యిల్లా చిక్కులు వచ్చి పడుతున్నాయేం!"

ఇల్లా అనుకొంటూండగా పాపకాలు జారి, ఎల్లా పడిందో, దబేలున నీళ్లలోపడి మునిగి లేచింది. నీళ్లు మెడపైదాకా వస్తూ నోటికి ఉప్పఉప్పగా తగులుతూన్నాయి.

"ఉప్పగా ఉండేది సముద్రమేగా? సముద్రంలో పడిపోయానన్నమాట. అయితే, ఇక్కడనుంచి ఒక రేవుకుచేరి, అక్కడినుంచి రైలుమీద మా ఊరు వెళ్లొచ్చు. (పాపవాళ్ల ఊరునుంచి ఒకసారి రైలుమీద, ఓ "ముద్రం రేవున్న ఊరుకువెళ్లి, అక్కడ సముద్రస్నానంచేసి వచ్చింది. అందుచేత ఏ రేవైనా అల్లాగే ఉండి, తన ఊరుదాకా రైలుంటుందికదా అనుకొంది).

కాని ఇంకాసేపు చూసేటప్పటికి తను ఉన్నది సముద్రం కాదనీ, కన్నీళ్లమడుగు అనీ పాపకు తెలిసి వచ్చింది. ఇందాక తను తొమ్మిది అడుగుల ఎత్తున ఉన్నపుడు కార్చిన కన్నీళ్లన్నీ ఇల్లా మడుగుకట్టి, అందులో తను మునిగితేల్తున్నానని తెలుసుకొంది.

"ఇందాక అంత ఏడవకుండా ఉంటే ఎంత బాగుండేది! అన్నీ ఇల్లాగే చేసుకోటం! వద్దంటూన్నా, కడవలకొద్దీ కన్నీళ్లుగార్చి ఒకటే ఏడుపాయెను! ఇప్పుడు ని కన్నీళ్లలో నువ్వే మునిగిపోవాలి. చేసుకొన్నంతా అనుభవించక, తప్పుతుందా?....అరెరె; ఇదెక్కడి వింత! ఎవళ్ల కన్నీళ్లల్లో వాళ్లు మునిగిపోవట మేమిటి? అయినా ఇవాళ అన్నీ వింతలుగానే ఉన్నాయి!"

ఇల్లా అనుకొంటూనే, దోవా, తెన్నూ ఏమన్నా కనబడుతుందేమోనని పాప ఆ కన్నీళ్ల మడుగులో, ఈదుతున్నట్టు కాళ్ళూ, చేతులూ బడబడా కొట్టుకొంటూ, తల ఎల్లాగో నీళ్ల మీద తేల్చుకొంటూ, అటూ యిటూ ఈదటం మొదలు పెట్టింది.

ఇంతలో ఆ మడుగులోనే కాస్త దూరంగా మారేదో జంతువో, మనిషో, ఏదో నీళ్లు తపతపా కొట్టున్నట్టు శబ్దం వినిపించి, పాప అటు ఈదుకొంటూ శబ్దంవచ్చే దగ్గిరకు పోయింది.

## 4

ఆ జంతువును చూడగానే, పాప, అదేదో నీటిగుఱ్ఱమో, ఇంకేదో పెద్ద నీటిజంతువో అని ముందు అనుకొంది. కాని ఇంతలో తను చాలా చిన్నదానై పోయానని జ్ఞాపకంవచ్చి, అల్లా కనపడుతూందే గాని,

అదీ తనలాగే ఈ నీళ్లల్లో జారిపడ్డ, చిట్టెలుక అని పాప గుర్తించింది.

"ఇప్పుడీ ఎలుకతో మాట్లాడితే ఏమైనా లాభం ఉంటుందా? ఏమో! బహుశా ఈ ఎలుక కూడా మాట్లాడుతుందనే అనుకుంటాను. ఇక్కడ అన్నీ ఇల్లాంటి సంగతులేగా జరిగేవి! అయినా పలుకరించిచూస్తే నష్టమేముంది?"

"అయినా ఎల్లా పలకరించాలో! ఇందాక మాట్లాడబోయేటప్పటికే కుందేలు పారిపోయింది. సరిగ్గా గౌరవంగా పల్కరించాలి. ఎలుకగారూ అంటే- ఎలుక అంటే కోపం వస్తుందేమో! మరేమనాలి? ఆగు: మూకపం అంటే ఎలుకేగా - ఆ! మూకపం కాదు, మూషకం! మూషకం అంటే ఈ ఎలక్కు తెలుస్తుందో, తెలియదో? అన్నయ్య వ్యాకరణం పుస్తకంలో, ఎవర్నైనా పిలిచేటప్పుడు "ఓ, ఓయీ, ఓరీ, ఓసీ - సంబోధనా ప్రథమావిభక్తి" - అని ఉందిగా - ఓయీ, ఓరీ, ఓసీ, అంటే ఎలక్కు కోపం రాదూ? అల్లా కాదు, 'ఓ మూషకమా!' అంటే సరి."

అనుకొంటూ పాప గొంతుక సవరించుకొని, "ఓ మూషకమా, దయచేసి ఈ మడుగులోంచి బైటకు చేరుకునేందుకు నాకు ఏదైనా దోవ చూపిస్తారా? ఈదిఈది నాకు ఆయాసం వస్తోంది." అంది.

ఎలుక ఏమీ మాట్లాడలేదు. తెల్లబోయి

చూసినట్లు చూసి, కనుబొమ్మలూ మొకమూ చిట్లించుకొన్నట్లు చూసింది.

"ఈ ఎలక్కి తెలుగు రాదేమో? అసలు కొంచెం మన ఎలుకలకంటె తెల్లగా ఉన్నట్లుంది - సీమ ఎలుక ఏమో? అయితే ఇంగ్లీషు తప్ప రాదే ఎల్లా దీంతో మాట్లాడటం?"

ఇంగ్లీషుప్రైమరీలో మొదటి పేజీదాకా పాప అప్పుడప్పుడు చూసింది. అక్కయ్య చదువుతూంటే అంతవరకు వింది. సరే ఇంగ్లీషులో మాట్లాడుదామని "కాట్, రాట్, మాట్" అంది.

ఎలుక ఒక్కగంతుతో నీటిపైకి ఎగిరి, మళ్ళీ గడగడా వణకుతూ నీటిపైన పడింది. పాప 'అయ్యో! పాపం ఈ ఎలక్కి కష్టంకలిగించా' ననుకొంటూ, "అయ్యొఅయ్యో క్షమించాలి! నీకు పిల్లు లంటే ఇష్ట ముండ దన్నమాట మరచిపోయాను" అంది.

ఇంతవరకూ మాట్లాడని ఎలుక, కీచుగొంతుక పెట్టి మొహం జేవురించుకొని "ఇష్టమా! పిల్లు లంటే ఇష్టమా? ఛీ! ఛీ! నువ్వే నేనైతే నీకుంటుందీ పిల్లి అంటే ఇష్టం?"

పాప సముదాయింపుగా, "ఉండదులే! ఉండ దుండదు. పొరపాటే. ఆ మాటకేం కోపం తెచ్చుకో వద్దు. అయినా నీ కొకసారి, మా దీనను చూపించ గల్గితే బాగుండేది. దీన ఎంత మంచిపిల్లి!"

పాప బద్ధకంగా ఈదుతూనే ఎలుకతో మాట్లా డుతున్నా నన్నమాట మరిచిపోయి సగం తనలో తానే చెప్పుకొంటూన్నట్టు సాగించింది.

"మ్యావ్! అంటూ ఒళ్లంతా శుభ్రంగా, నాకుకొంటూ, కూర్చుంటుంది. చేతితో ముట్టుకొంటే పట్టుకుచ్చులాగా ఉంటుంది. ఎన్నెన్ని గమ్మత్తులు చేస్తుంది, ఎంచక్కగా - ఎలుక కనబడితే ఒక్క గంతులో "ఆమ్" అని పట్టేసి...."

అప్పటికే ఎలుక మళ్ళీ బిగుసుకుపోతూన్నట్టు మొహం పెట్టి, ఒళ్ళంతా గగుర్పొడిచినట్లు వెంట్రుకలు నిక్కపొడిచి, కోపంతో వెళ్లిపోయేందుకు సిద్ధమై వెనక్కి తిరిగింది.

"లేదు, లేదు! ఆ విషయం మాట్లాడనుగా - పొరపాటు! పొరపాటు! నీ కక్కరలేకపోతే మనం పిల్లినిగురించి మాట్లాడుకోవద్దులే!"

ఎలుక, తోకతోసహా వణికిపోతూనే కోపంగా కీచుగొంతుకతో అరిచింది: "మన మంటావేం మనము! అక్కడికి నేను కూడా మాట్లాడినట్లు! అల్లాంటి వెధవ జంతువుల విషయం నే నెప్పుడైనా ఎత్తుతానా? అసలు మా యింటావంటా పిల్లి పే రెత్తరే! ఎంత అసహ్యం, అదంటే! ఇంకెప్పుడూ నాదగ్గర ఆ పేరే రానీయకు."

"రానీయనులే! రానీయ నంటున్నాగా, దా పోవద్దు," అంటూ పాప, ధోరణి మార్చాలన్న ఆడావుడిలో, "పోనీలే! పోనీ, కుక్కలంటే నీ కిష్ట

మేగా. మా యింటిపక్కనే ఒక చక్కని కుక్కపిల్ల వుంది. దాని జుట్టు బంగారు కుచ్చులాగా ఉంటుంది. చెవు లెంత చక్కగా ఉంటా యనుకున్నావ్ ? తోక ఉంగరం తిరిగి ఉంటుంది. ఎన్నిమాట్లు లాగినా మళ్ళీ చుట్టుకొంటూనే ఉంటుంది! దానికి ఎన్ని ఆటలు వచ్చు. బంతి విసిరేస్తే పరుగెత్తి కెళ్ళి మళ్ళీ తెచ్చిస్తుంది. కఱ్ఱముక్క అయినా అంతే; మాయింటి పక్క అబ్బాయిది అది. దీని ఖరీదు బోలెడు రూపాయి లుంటుం దట! అది ఎలుకల్నిట్టే పట్టేస్తుందని ఆ అబ్బాయి అన్నాడు..."

అంటూండగానే, ఎలుక మళ్ళీ దూరంగా ఈద టానికి నీళ్ళు బడాబడా కోపంగా కొట్టూ తిరుగు తూంది. "అయ్యో రామా! మళ్ళీ ఎలుక్కి కోపం తెప్పించానే, ఎల్లా ఏడుస్తుంది.' అని దీనంగా తనలో తను అనుకోటం మొదలుపెట్టింది.

నెమ్మదిగా ఈదుతూ ఎలుక వెంటబడి మృదు వుగా—"బాబ్బాబు! ఎలుకా నాతల్లివి కాదూ! వెనక్కి రావూ! పిల్లులు, కుక్కలూ, వీటి పేరు ఎత్తొద్దుగా! నీ కిష్టంలేక పోతే అవి మాట్లాడుకోనే వద్దులే, దాఅమ్మా! దా! మరి" అని వెనక్కి పిలిచింది.

ఎలుక నెమ్మదిగా మళ్లీ వెనక్కి పాపదగ్గిరకు ఈదుకొంటూ వచ్చింది. ఎక్కువగా నీళ్ళల్లో ఈదటం వల్లో, లేక, పిల్లుల, కుక్కల పేరు చెప్తే వచ్చిన భయమూ, కోపమూ వల్లో ఎలుక మొగం పాలి

పోయినట్లుంది. కొద్దిగా గజగజ లాడుతూనే, వణుకు తూన్న గొంతుకతో—

"ముందు ఒడ్డుకు పోదాం పద. అక్కడ నా సంగతి అంతా నీకు విశదంగా చెప్తాను. నాకు పిల్లులూ, కుక్కలూ అంటే ఎందుకు అంత ద్వేషమో నీకు పూర్తిగా తెలిసొస్తుంది. పద పోదాం."

అప్పటికప్పుడే, ఆ మడుగులో కాలుజారి పడ్డ జంతువులెన్నో ఒక చోట చేరి చాలా ఇరుకై పోయింది. ఒక బాతు, ఒక హంస, ఇంకో పిచ్చిక, గద్ద, కొంగ, ఇంకా ఎన్నెన్నో చిత్రవిచిత్ర జంతువులూ, పక్షులూ అనేకం చేరి మడుగులో, క్రిక్కిరిసి పోయి ఈదుతున్నాయి. పాప ఒడ్డుకు ఈదటం మొదలుపెట్టింది. పాప వెనకాలే, ఆ ఎలుకా, పక్షులూ, జంతువులూ అన్నీ కూడా ఒడ్డుకేసి ఈదటం మొదలుపెట్టాయి.

## 5

ఒడ్డుకు చేరి చూసుకొనేటప్పటికి, అంతా బలే మంద తయారయారు. పిట్టలన్నీ యీకలూ, తోకలూ అన్నీ తడిసిపోయి నీళ్లుగారుతూ ముద్దగట్టుకొని పోయి ఉన్నాయి. జంతువులు, బొచ్చంతా తడిసిపోయి చర్మాని కంటుకుపోయి నీళ్లోడుతూ, చర్మంమీద

చలికి అలలు అలల్లాగా వణుకుపుట్టి నిలుచున్నాయి. అందరికీ, ఈ చలితో, వణకుతో, తడిగారుతూ ఉండటంతో, చాలా చిరాకుపుట్టుకొస్తోంది. ఎవళ్లకి వాళ్ళే పల్కరిస్తే ఛర్‌మనేటట్లు కోపం రెచ్చిపోతూ వున్నారు.

ముందు ఒళ్లుఆర్చుకోటం ఎల్లాగా అనేదే అందరికీ ఆలోచనైపోయింది. ఎల్లాగో తేల్చుకోనేందుకు అందరూ కలిసి సమాలోచనలు మొదలుపెట్టారు. కాసేపటిలోపునే పాప అందరితోటీ చిన్ననాటి స్నేహితులతో మాట్లాడుతూన్నంత చనువుగా ధారాళంగా సంప్రదిస్తోంది. ఇమాటకొస్తే కాసేపు రామచిలుకతో పెద్దవాదంకూడా వేసుకుంది. చివరికి రామచిలుక ముహం మాడ్చుకొని, "అయినా నేను నీకంటే పెద్దదాన్ని, నా కెక్కువ తెలుసంటావా? నీ కెక్కువ తెలుసంటావా?" అని వాదం తుంచేయబోయింది. కాని పాప అల్లా ఒప్పుకోక, "అసలు పెద్దదానివౌనో కాదో? నీ కెన్నేళ్ళో చెప్ప"మంది. చిలుక "నే చెప్పనంటే చెప్ప"నంది. అంతటితో ఆ వాదన ముగిసింది.

అక్కడ చేరిన మూకఅంతటిలోనూ, ఇందాకటి ఎలుకకే కొస్త నలుగురిలో పెద్దరిక మున్నట్లు

అనిపించింది. ఎలుక ఆజ్ఞాపనగా అందరివంకా తిరిగి "అసలు అంతా ముందు కూర్చోండి. ఒళ్లు పొడిఆర్చు కోటం ఎల్లాగో నేను చెప్తాను" అంది. అందరూ ఎలుక చుట్టూ గుంపుగా తీర్చి కూర్చున్నారు. పాప ఎలుక ఏం చెప్తుందో విందామని ఆదుర్దాగా ఉంది. అప్పటికే పాపకు పడిశంపట్టి తుమ్ములొస్తున్నాయా అనిపిస్తోంది. అంచేత ఎల్లాగో త్వరగా ఒళ్లు పొడిఆర్చు కోంటేతప్ప జ్వరంవస్తుందని భయంతో ఎలుక ఏం ఉపాయం చెప్తుందో విందామని ఆదుర్దాగా చూస్తోంది.

ఎలుక ఉపన్యాసం ఇయ్యబోయే నాయకుడి లాగా, "హు! హూ! ఉ ఊ ఉ!" అంటూ గొంతు సవరించుకొంది.

"ఊఁ! అంతా రెడీయేనా! సరే వినండి, నాకు తెలిసిన అన్నిటిలో పొడి అంటే పొడివిషయం, అంటే ఏమాత్రం తడిలేదన్నమాట, అంత పొడిది, ఆ మాటకొస్తే ఎండిపోయిందే చెప్తాను. వినండి. ఖామోష్! ఎవరక్కడ మాట్లాడేది? ఎవరూ మాట్లాడ కూడదు. తెలిసిందా? ఊఁ.

"కృష్ణదేవరాయలవార్ని చక్రవర్తిగా చేసుకోమని, రామానుజాచార్యులవారు తెలుగు మన్నె సుల్తానుల నందరినీ పిలిచి చెప్పారు. దోపిడీల కలవాటుపడ్డ

మన్నెసుల్తానులలో కళింగగంగు ఎదిరించాడు. కళింగగంగును రాయలవారు చావచితకకొట్తే పారిపోయేందుకు ఎలుక కన్నం కూడా కనబడలేదు."

"ఉహ్హూహ్హూ" అంటూ రామచిలక గజగజా వణికింది.

ఎలుక కోపంతో ముఖం జేవురించుకొని కూడా, చాలా మర్యాదతో మాట్లాడుతూన్నట్లు, చిలుకవంక తిరిగి—

"క్షమించాలి! మీ రేదో మాట్లాడుతున్నట్లున్నారు" అని ఠీవిగా కోపంతో అడిగింది.

రామచిలుక అడావిడిగా, "అబ్బే నేను కాదు" అంది.

"మీమాట అనే నేను అనుకొన్నాను. సరే కథ కానిద్దాం. ఎక్కడున్నాం? ఊఁ కళింగగంగుకు ఎలుకకన్నం కూడా కనబడలేదు. గజపతి కూడా అడిలిపోయాడు. ఇద్దరికీ చాలా ఇదిగా ఉంది."

"ఏదిగా ఉంది" అని హంస అడిగింది.

"ఇదిగా ఉందని చెప్తే - 'ఇది' అంటే తెలియదా?" అని ఎలుక కోపంగా అరిచింది.

"ఇది అంటే తెలియకగాదు; ఏదన్నా చూపించి ఇది అంటే అది ఇదీ అని తెలుస్తుంది. అంతే

గాని ఊర్కే ఇదిగా ఉండంటే ఏది, ఏదిగా ఉన్నదీ, ఏం తెలుస్తుంది ?"

ఎలుక ఆ మాటలే విననట్లు మొహం అవతలికి తిప్పి, హంస మాట్లాడనే లేదనుకొన్నట్లు మళ్ళీ తొందరతొందరగా కథ మొదలుపెట్టింది.

"అల్లా ఇదిగా ఉండేటప్పటికి ఇద్దరూ కలిసి తురకరాజులదగ్గిరకు వెళ్ళారు. తురకరాజులు మొదట మర్యాదగానే చూశారు—" అని పాపవంక తిరిగి, "ఏం ? కాస్త ఏమైనా తడిఆరి పొడిగా అయారా ?" అని అడిగింది.

"తడి ఆరాలేదు ; నా మొహమూ లేదు. ఇందాకటికన్నా ఎక్కువ తడిగా అవుతున్నాను." అని పాప జవాబు చెప్పింది.

పాప ఆ మాట అనేటప్పటికి హంస నెమ్మదిగా లేచి—

"ఏతత్ పక్షమున అస్మత్సమావేశమును వ్యవధానించి, తత్ క్షణావశ్యక క్రియాకలాపమున కుద్యమించ వలెనని నేను ప్రతిపాదించుచున్నాను." అంది.

గద్ద వెంటనే "తెలుగు మాట్లాడరాదా? ఏమిటా భాష! ఆ మాటల్లో మూడు వంతులు నాకర్థమవనే లేదు. మీకుకూడా అయామో లేదో నాకు తెలియదు." అని మొహం వంచి పక్కవాళ్ళకు

కన్నుగీటి చిన్న నవ్వు నవ్వింది. పక్కనున్న చిన్న చిన్న పక్షులుకూడా కిలకిలా నవ్వాయి.

హంసకు కోపం వచ్చింది. "నే చెప్పొచ్చిందల్లా, మనం పొడిగా అవాలంటే, 'కొక్కు' పరుగాట ఆడాలనే" అంది.

"'కొక్కు' ఆట ఉందిగాని కొక్కుపరుగా ఏమిటి?" అని కోతి అడిగింది. హంస వెంటనే---

"ఎందుకూ, చెప్పటంకంటే ఆడి చూపిస్తేనే తేలిక" అంటూ ఆట చూపించటం మొదలుపెట్టింది.

ముందు చుట్టూ, ఒక పెద్ద గుండ్రని గిరి గీసింది. గిరిమీద అంతా కాస్త కాస్త దూరంలో అందరినీ నిలబెట్టింది. "ఒకటి, రెండు, మూడు" అంటం లేకుండానే ఎవళ్ళకి వాళ్ళే గిరిచుట్టూ పరుగెత్తటం మొదలెట్టాలి. ఎవళ్ల ఇష్టం వచ్చినప్పుడు వాళ్లు పరుగెత్తడం, ఎవళ్ల ఇష్టంవచ్చినప్పుడు వాళ్లు ఆగిపోవటమే తప్ప, ఆటకి ఓ దోవా, తెన్నూ లేదు.

అల్లా ఓ అరగంటసేపు అందరూ పరుగెత్తేటప్పటికి అందరి ఒళ్ళులూ పొడిఆరిపోయాయి. హంస చటుక్కున నిలిచిపోయి "ఆట అయిపోయిం"దని కేక పెట్టింది.

అందరూ ఆయాసంతో వగరుస్తూ హంస చుట్టూ చేరి, "అయితే, ఎవరు నెగ్గినట్టు" అని గల్లంతుగా అడగటం మొదలు పెట్టారు.

హంస కేమీ తోచలేదు. కాస్సేపు దీర్ఘంగా ఆలోచించినట్లు, పెదవులమీద వేలు వేసుకొని ఆలోచించి, "అందరూ నెగ్గారు. అందరికీ ప్రైజు లివ్వాల్సిందే" అంది.

అంతా ఒక్కసారే మళ్లీ "మరి బహుమతు లెవ ళ్ళిస్తారు?" అని అడిగారు.

"ఎవళ్ళియ్యాట మేముంది! ఆవిడే ఇస్తుంది" అని హంస పాపవైపు చూపించింది. అంతా "బహుమతులు, బహుమతులు" అంటూ గోల చేస్తూ, పాప చుట్టూ మూగారు. పాపకు ప్రైజు లెల్లా యియ్యాటమో, ఎక్కడ నుంచి తేవటమో ఏమీ పాలుపోక, ఆలోచిస్తూ గౌను జేబులో చెయ్యిపెట్టి చాకలేటుల పొట్లాం తీసింది. అదృష్టవశాత్తూ ఆ పొట్లంచుట్టూ మైనం కాగితం ఉండటంవల్ల చాకలేటు లేవీ ఉప్పు నీళ్ళల్లో తడవ లేదు.

పాప ఆ చాకలెట్లన్నీ అందరికీ తలా ఒకటి బహుమతులుగా పంచేసింది.

"మరి ఆమెకు కూడా ఒక బహుమతి ఇయ్యొద్దూ?" అని ఎలుక అడిగింది.

"ఆ! తప్పకుండా ఇయ్యాలి" అని హంస పాప వైపుకు తిరిగి, "ఇంకా నీజేబులో ఏమున్నాయో తియ్" అంది.

పాప జేబు వెతికితే ఒక గచ్చకాయ దొరికింది. హంస ఆ గచ్చకాయ పుచ్చుకొని, పాపవంక తిరిగి,

"ఈ చక్కని గచ్చకాయను బహుమానంగా స్వీక రించవలసిందని మేమంతా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాము," అని అతిమర్యాదతో వంగి పాప కందించింది. తక్కినవాళ్ళంతా, మెచ్చుకొంటూన్నట్లుగా చప్పట్లు కొట్టారు.

పాప కిదంతా చాలా వేళాకోళంగా కనపడి నవ్వు వస్తోంది. కాని వాళ్ళందరివంకా చూసేటప్పటికి, వాళ్లు వేళాకోళం కాక, నిజంగానే అనుకొంటు న్నారని నవ్వితే వాళ్ళను చూసి నవ్వినట్టుండి, వాళ్లకి కోపం వస్తుందేమో ననీ, భయంతో నవ్వాపుకొని, హంసకు నమస్కరిస్తూ, ఆ గచ్చకాయను చాలా భక్తితో తీసుకొంది.

పక్షులూ జంతువులూ అన్నీ చాకలేట్లు తింటం మొదలుపెట్టాయి. పెద్ద పక్షులకు ఆ చాక లేట్లు నాలికకిందకే సరిగ్గా చాలక, "కొండనాలిక్కే కబురందలే" దని గునుపు మొదలుపెట్టాయి. చిన్న పక్షులకు చాకలేటు ఉండగా గొంతుకలో అంటుకొని, పలుకు మారి, వెన్నుమీద పెద్దవాళ్ళు కాస్త చరుస్తూంటే, తెప్పరిల్లి, కళ్ళనీళ్ళపర్యంతమూ అయింది. ఎల్లాగో అంతా చాకలేట్లు పూర్తిచేశారు. మళ్ళీ అంతా ఒకచోట గుండ్రంగా చేరి కూర్చున్నారు.

అంతా ఎలుకవంక తిరిగి "ఏదన్నా కథ చెప్పవూ ?" అంటూ అడగటం మొదలు పెట్టారు.

పాప నెమ్మదిగా ఎలకచెవిలో "ఇందాక కు-

అన్నావి–అన్నాం. పూర్తిపేర్లు అంటే మళ్ళీ ఎలుకకు కోపం వస్తుందేమోనని భయం? నీకు కోపం ఎందుకో చెప్పలే నన్నావు. చెప్పవా ?" అంది.

ఎలుక నిట్టూరుస్తూ నాదో తలా తోకా లేని ఏడ్పు కథ.

ఎలుక కింత పెద్దతోక ఉంటే తోక లేని కథే మిటా అని పాప ఆశ్చర్యంగా ఆలోచిస్తోంది. ఎలుక తన కథ మొదలుపెట్టింది. కథ వింటూన్నంతసేపూ, "ఇంత తోక ఉంటే ఎలక్కి తోక లేకపోవట మేమిటా ?" అనుకొంటూ పాప పరాకుగా కథ వినటం మొదలెట్టింది.

## 6

ఎలుక తన కథను ఆటల పదాలు పాడుతూన్నట్టుగా రాగం మాత్రం తీస్తూ ఓ లయా ఓ తీరూ, ఉండీ, లేకుండా నే చెప్పసాగింది.

కొంకినక్క ఇంటి ప్రక్క
డొంకలోన తిరుగుతున్న
చిట్టెలుకను చూసి ఆగి,
ఆట్టే ఉరిమి అంది: "ఆ,
పద, పద పంచాయితీకి పద
పంచాయితీ చెప్పించాలి,
నీమీద తప్పు పెట్టి,
నేరానికి శిక్షేయిస్తా
ఇవాళ నాకు పనే లేదు
ఓ వేళ రానంటావేమో, ఆ

పప్పు లుడకవు పద పద
ఇప్పుడే పంచాయితీకి పద"
ఎలక తెల్లబోయి చూసి,
ఎలాగో ధైర్యం తెచ్చుకుని
నక్కతో అంది: "అయ్యా,

ఒక్కమాట తెలవిస్తా;
ఇంత పొద్దున్నే పంచాయితీకి,
ఎంత వెదకినా పెద్దలు దొరకరు
ఇప్పటి మన్య తీర్పు చెప్పే
పెద్దదొర లేనప్పుడు—

ఊరికే వాదించుకోవటం,
నోరునొప్పే తప్ప లాభమూ లేదండి"
కొంకినక్క కొంటెతనంగా
వంకచూపు చూసి అంది:
"లేవిడీమాటలు చెప్పి ఎలకా

నేరంజే తప్పించుకుందామనుకున్నావా?
తప్పదు తప్పదు, పద పద
నేనే పంచాయితీ పెద్దను
నేనే తీర్పు చెప్పేవాడను
నీమీద నేరం,

నేనే ఋజువు చేస్తా,
నేనే న్యాయం చూస్తా,
నీ తప్పంతా విని,
ఆ తీర్పు నేనే చెస్తా,
నీకు మరణశిక్ష వేసి,
నేనే శిక్ష అమలు జరుపుతా."

కథ చెప్తూచెప్తూ ఎలుక దబాలున ఆగి, పాప వంక తిరిగి "నువ్వు కథ వినటంలేదు. పరధ్యానంగా ఏదో ఆలోచిస్తున్నావు" అని కోపంగా అంది.

పాప వెంటనే అతివినయంగా "అబ్బెబ్బే లేదండి లేదు, వింటున్నాను వింటున్నాను. నాల్గో చరణందాకా అయింది కాదూ?" ఎలుకకు ఒళ్లు మండిపోయి అరవంలో అరచింది:

"అదెల్లా ముడియాద్"

పాప, ఎల్లాగో ఎలుకను మంచిమాట చేసుకోం దామని, "ముడా, ముడి పడ్డదా, ఎక్కడా, నేను విప్పనా?" అని బహువినయంగా అడిగింది.

ఎలుకకు కోపం మరీ హెచ్చిపోయింది. "ఆ అపకతవక వాగుడే వద్దండి. నువ్వు కావాలని అవ మానం చేస్తున్నావ్" అంది.

పాప "అయ్యో రామా! నేనేం అవమానం చెయ్యాలని అనుకోందే. అయినా నీకు ఉత్తపుణ్యా నికే ప్రతిదానికీ పుట్టెడు కోపం వస్తుందామెను— మల్లా ఏడిచేది గోడన" అంది.

ఎలుక మొహం బిగించుకొని "ఉహు హుహు" అని గొణుగుతూ, లేచిపోవటం మొదలుపెట్టింది.

"బాబ్బాబు! పోకు దా! మా అమ్మవు కాదూ, కథ పూర్తిగా చెప్పిపోకపోతే మొండితేలు కుట్టుంది! దా! మా తల్లివి కాదూ, దా చెప్పు" అని పాప బతిమాలటం మొదలుపెట్టింది. తక్కిన వాళ్ళందరూ కూడా ఎలుకను బ్రతిమాలటం మొదలు పెట్టారు. కాని ఎలుక తలకాయి తిప్పేసి రాక తొందర తొందరగా నడిచిపోయింది. ఎలుక మలుపు

తిరిగి మాయమైంది. "అరెరె! పాపం కథ పూర్తిగా చెప్పకుండా పోయిందే" అంటూ హంస నిట్టూర్చింది.

ఈ అవకాశం తీసుకొని, ముసలిపీత పిల్లపీతకు నీతులు చెప్తూంది. "చూశావే అమ్మాయి! ఇది చూసిఅయినా కోపం తెచ్చుకోకూడదని బుద్ధి తెచ్చుకో" అని బుద్ధులు చెప్పడం మొదలుపెట్టింది.

"ఓ యమ్మ, కాస్త నాలుక కట్టిపెట్టుదూ తల్లీ! నీ మాటలు వింటే చివరికి నత్తపురుగుకు కూడా చిరాకు పుట్టుకొస్తుంది" అని ఆ పిల్లపీత తల్లిని గదమాయించింది.

"ఇప్పుడు నాతో దీన ఉంటే ఎంత బాగుండేది? ఇట్టే, ఈ ఎలుకను వెనక్కి పిలుచుకొచ్చేది కదా!" అని పాప తనలో తనే గట్టిగా అనుకొంది. "దీన ఎవరో మేం అడగటానికి అభ్యంతరం ఏం లేదు కదా!'' అని హంస తన అతిమర్యాద పద్ధతిలో అడిగింది.

పాపకు దీననుగురించి మాట్లాడితే, వినేవాళ్ళుంటే, ఇంక అన్నం నీళ్ళు కూడా అక్కరలేదు. అంత సరదా.

"దీన మా పిల్లి! అసలు ఎంత మంచిపిల్లి అనుకొన్నావు. దాని కెన్నెన్నో వచ్చు. ఎందుకూ! ఎలుకను పట్టటం ఎంత గమ్మత్తుగా పట్టుంది. ఓ! చూస్తేనే గాని, అసలు ఎవళ్ళకీ తెలియనే తెలియదు.

పిట్టలను మాత్రం - అల్లా చూసేటప్పటికే గప్పుమని ఒక్క గంతేసి ఇట్టే పట్టేస్తుంది -''

పాప అల్లా మాట్లాడుతూండగానే, చుట్టూ గొప్ప కలవరం బయలుదేరింది. పిట్టలన్నీ అడావుడిగా లేచి తమ తమ గూళ్ళకు బయలుదేరాయి. పాలపిట్ట "అబ్బో, చలి ఎక్కువైంది. ఇంకా ఇల్లా కూర్చుంటే నా గొంతుక పాడైపోతుంది" అంటూ తుర్రున ఎగిరి పోయింది. గోరింకపిట్ట తన పిల్లలను పిలుస్తూ "పదండి పదండి, గూళ్ళకు పదండి; ఇప్పటికే చాలా పొద్దుపోయింది, ఇక నిద్దరోవాలి, పదండి." అంటూ తన పిల్లలను వెంటపెట్టుకొని బయలుదేరింది. ఉడుతపిల్ల, కోతిపిల్ల, హంస, జేగపిల్ల, అన్నీ కూడా ఒక్కటీ లేకుండా బయలుదేరి వెళ్ళిపోయాయి.

పాప ఒక్కతే కూర్చుని జాలిగా "అయ్యో! దీనపేరు తేకుండా ఉండాల్సింది. ఇక్కడెవళ్ళకూ దీన అంటే అదేమిటో ఇష్టమే లేదు. పాపం, దీనా! ఇంక నీవు నాకు కనబడవుకాబోలు" అంటూ, ఒంటరి పాటుగా కూర్చుని ఏడవడం మొదలుపెట్టింది.

ఇంతలో మళ్ళీ తపతపమంటూ తప్పటడుగుల శబ్దం వినబడింది. ఎలుక మళ్ళీ మనస్సు మార్చుకొని కథ చెప్పటానికి వస్తోందేమోనని పాప ఉత్సాహంగా చూసింది.

# 7

ఇందాకటి తెల్లకుందేలే, మళ్ళీ అడుగులో అడు గేసుకొంటూ, ఏదో పారేసుకొన్నట్టు చుట్టూ నేలంతా కలయజూసుకొంటూ, ఎప్పటిమాదిరిగానే గొణుక్కొంటూ, "అయ్యయ్యో ఈ బోసిచేతులూ, ఈ రూపం, నన్నా చూస్తే, రాణిగారు ఇంక నన్నా బతకనిస్తుందా ? వెంటనే ఉరితీయించేస్తుందే! అస లివన్నీ ఎక్కడ పారేశానో, గొడవ! నా మతి మండి పోనూ, అయ్యో, హయ్యో!" అని గొణుగుకొంటూ వస్తూంది.

పాప, వెంటనే, కుందేలు, మురుగులూ, విసన కర్రాకోసం వెదుకుకొంటూాందని గ్రహించింది. కాని అవి ఏమయ్యాయో! పాపకూడా, మంచిపిల్లలాగే, వాట్లని వెదికిపెట్టి, కుందేలుకు సాయంచేద్దామని, తన చుట్టూ వెదకడం మొదలుపెట్టింది. కాని ఏమీా ఎక్కడా కనబడలేదు. ఇందాక తన చేతిలోనే ఉండాల్నే! ఎక్కడపోయాయో! కన్నీటిమడుగులో నుంచి ఈదుకొచ్చినప్పటినుంచి అన్నీ తారుమారై పోయినట్లే ఉన్నాయి. ఇందాకటి ఆ హాలు, ఆ గాజు మేజా, ఆ చిన్నతలుపూ, అన్నీ ఏమైపోయాయో పూర్తిగా మాయమే అయిపోయినట్లున్నాయి.

పాప అలాగే నెమ్మదిగా వంగివంగిచూస్తూ, తనచుట్టూ అంతటా, వాటికోసం చూస్తూంది.

ఇంతలో కుందేలు పాపను చూసింది. "ఓసి, అప్పలమ్మా! ఇక్కడేం చేస్తున్నావే; పనిమానేసి, దొంగవేషాలువేసి ఇక్కడ తిరుగుతున్నావా! పో! పో! పో! పోయి ఇంటికి పరుగెత్తికెళ్లి, ఓ విసనకఱ్ఱా, జతమురుగులు, వెంటనే పట్టుకురా! పరుగెత్తి ఇక్కడ నున్నట్టు రావాలి, తెలిసిందా! పో! పో! ఇంకా నిల్చు న్నావే" అని గదమాయించింది.

పాప పరుగెత్తుతూ "వాళ్ల పనిచేసే మనిషి అప్పలమ్మ ననుకొన్నట్టుంది. నేను అప్పలమ్మ నేమిటి! బాగుందే! తీరా నన్ను మళ్లీ చూశాక అప్పలమ్మ కాదని గుర్తిస్తే, ఈ కుందేలు భలేగా ఆశ్చర్య పోతుంది. అయినా, దీని మురుగులూ, విసనకఱ్ఱ దీనికి తెచ్చియ్యటమే మంచిది, అదే! దారికి తే మాటే" అను కొంటూ పరుగెత్తుతూంది.

ఇంతలో ఒక చక్కని చిన్నయిల్లు కనబడింది. ఆ యింటి వీధితలుపుమీద, ఇత్తడి అక్షరాలతో "శ్రీ శశకంగారు" అని చెక్కిఉంది.

"కంగారేమిటి; కుందేలు కాదూ. ఓహో, శశకంగారు గాబోలు." అనుకొంటూ, తలుపు తట్ట కుండానే, తోసుకుని మేడ మెట్లమీద గబగబా ఎక్కడం ప్రారంభించింది.

పైకి ఎక్కుతూన్నంతసేపూ, అసలు అప్ప లమ్మ కనబడి, మురుగులూ, విసనకఱ్ఱా తను తీసు కొనే లోపలే తనను కనిపెట్టి, "ఆసిదొంగా!" అంటూ

తరిమేస్తుందేమోనని పాపకు కొంత భయం పుట్టింది.

"అసలు అయినా బలే గమ్మత్తుగా ఉంది; ఇప్పుడు కుందేలుకు నౌకరీపని తయారయిందే నాకు. సరి! సరి! రేపటినుంచి, ఇంక దీనకూడా నాకు పనులు చెప్పడం మొదలుపెట్టుంది కాబోలు ఇంకనుంచి!" "ఏయ్ పాపా! ఇల్లారా! అల్లా బైటికి పోవాలి ముందు నడూ!" "ఏయ్ పాపా! నాకు కొద్దిగా పనుందిగాని, ఈ ఎలుకకన్నందగ్గిర కాసేపు కాపలాఉండి, ఎలక పారి పోకుండా చూడూ, ఎలక పారిపోకూడదు జాగ్రత! తెలిసిందా?" అంటూ, ఏవేవో పనులు చెప్తుంది గాబోలు. ఆ! - ఎందుకు చెప్తుందిలే! అల్లా అందరి మీద అధికారాలు చెలాయించటం మొదలుపెడితే, మా యింట్లోవాళ్లుమాత్రం దాన్ని అక్కడ ఉండ నిస్తారా యేమిటి ?"

ఇల్లా అనుకొంటూండగానే, పాప ఒక చిన్న గదిలోకి వచ్చేసింది. ఆ గది శుభ్రంగా అందంగా అలంకరించి ఉంది. పాప అనుకొన్నట్లుగానే, (ఎల్లా అనుకొందో, ఎందుకనుకొందో మరి!) అక్కడ మేజా బల్లమీద రెండుమూడు జతలు మురుగులూ, మూడు నాలుగు విసనకఱ్ఱలూ ఉన్నాయి.

పాప ఓజత మురుగుల్లూ ఓ విసనకఱ్ఱ తీసుకొని ఇంక వెళ్లిపోదామనుకొని ఇట్టే వెనక్కి తిరిగేసరికి అక్కడ ఓ అద్దం కనబడింది. ఆ అద్దం పక్కనే ఉన్న ఓ చిన్న సీసామీద పాప కళ్లు పడ్డాయి. ఈ మాటు

ఆ సీసామీద "నన్ను త్రాగు" అని కాగితం ఏమీ అంటించలేదు. అయినా, పాప ఆ సీసా మూతతీసి, సీసామూతి నోట్లో పెట్టుకొని సీసాలో ద్రావకం త్రాగటం మొదలుపెట్టింది. "తప్పకుండా ఏదో తమాషా జరిగితీరుతుంది. ఎందుకో! నే నేదైనా, తిన్నా, తాగినా జరిగితీరుతునే ఉంది. ఈమాటు మళ్లీ పెద్దదాన్నవుతానేమో! లేకపోతే అస్తమానం ఇంత బుల్లిపిల్లనుగా ఉండటం కూడా విసుగ్గానే ఉంది." అనుకొంటూ పాప సీసాలోదంతా గుటుకూ గుటుకూ త్రాగడం మొదలుపెట్టింది.

పాప అనుకొన్నంతా జరిగింది. సీసాసగం ఖాళీఅయేటప్పటికే, పాప తల ఇంటికప్పుకు గట్టిగా అదుముకొని నొక్కేస్తూంది. పాప అడావుడిగా సీసా క్రిందపెట్టేసి "ఇహచాలు! ఇహచాలు!"

"ఇంతకంటే ఇంక ఎదగకుండా ఉంటే నయం. అయినా ఇప్పుడీ, తలుపులో ఎల్లా పట్టేది, ఎల్లా బయటికి పోయేది? అంత ఎక్కువగా తాగకపోతే ఎంత బాగుండేది! అన్నీ ఇల్లా చేసుకేడవటమే అవుతోందే! కర్మ!" అనుకోటం మొదలుపెట్టింది పాప.

కాని ఇప్పుడేమనుకొని ఏం లాభం. పాప అల్లాగే ఎదిగి ఎదిగి పెద్దదైపోతోనే ఉంది. మోకాళ్ళమీద కూలబడినా గది పట్టటంలేదు. తలుపుకు ఒక మోచేయి ఆనించి, ముడుచుకొని ముడుచుకొని నేల మీద జేరగిల పడుకొంది. ఇంకా ఎదుగుతునే ఉంది.

ఓ చేయి కిటికీలోంచి బైట పెట్టింది. ఓ కాలు, ఇంటి కప్పులో చిమ్నీ ఉంటే ఆ గొట్టంలోకి పెట్టింది. ఇంకా గదికన్నా పెద్దదై పోతూన్నట్లే ఉంది.

"ఏడ్చినట్లే ఉంది! ఇంతకన్నా ఇంకేం చేస్తాను. ఇంకెంత ఎదిగినా ఇల్లు ఉండల్సిందేనే! తీరా ఏమై పోతానో గొడవ. !" అని గట్టిగా అనుకొంది.

పాప అదృష్టంవల్లనో ఏమో, ఆ సీసామందు ప్రభావం అంతటితో ఆగింది. పాప ఇంక ఎదగటం ఆగిపోయింది. కాని ఆ యిరుకులో కాలు కదిపేందుకూ చేయి కదిపేందుకూ, ఆఖరుకు మెడతిప్పుకొని ఒత్తిగిలి పండుకునేందుకూ వీలులేక చాలా ఉత్కృష్టంగా ఉంది.

"అబ్బ! ఇంతకన్నా ఇంటిదగ్గరే హాయిగా ఉండేది. అస్తమానం ఎదగటం, కుంచుకుపోవటం ఏమీ ఉండేది కాదు. ఎలకలు కుందేళ్ళు ఆజ్ఞలివ్వటం ఏమీ ఉండేదిగాదు-ఆ కుందేటి బొరియలో పడిపోకుండ ఉన్నా బాగుండేదే! ఆ--- అయినా, ఈ బతుకుకూడా ఓమాదిరి గమ్మత్తుగానే ఉంది! అసలు ఇప్పుడు నే నేమయిపోయానో! మునుపు, పిట్టకథలూ అవీ చదువుతూంటే, ఆ కథల్లోదాన్నయి పోతే బాగుండేదనిపించేది! కాని ఎప్పుడూ అల్లా అవటం అసంభవం అనుకునేదాన్ని! ఇప్పుడు నాదీ అలాంటి కథే ఐపోయిందే---ఈ కథకూడ ఎవరైనా రాస్తే బాగుండును---ఎందుకూ నేనే ఎదిగాక రాస్తా"

అని, ఎదగటం అనేటప్పటికి నిట్టూర్చి, "ఇప్పుడిక్కడ ఇంక ఎదిగేందుకు జాగా ఎక్కడుంది ?" అనుకొంది.

"అయితే ఇంకెప్పటికి ఇంతకన్న ఎదగనన్న మాటేనా ! అదీ ఓమాదిరి లాభమే. ఎప్పటికీ ముసలి దాన్నవను - కాని, ఎప్పుడూ పాఠాలు చదువుకొంటూనే కూర్చోవద్దూ! ఉహూ! ఆ పని మాత్రం వద్దు బాబూ." అనుకొంటూనే, మళ్ళీ తన్ను తనే కోప్పడుకొంటూ,

"ఓసీ తెలివితక్కువ పాపా! ఇక్కడ పాఠాలెల్లా నేర్చుకొంటావే! ఇక్కడ నీకే సరిగ్గా జాగా లేదాయెను. ఇంకా పుస్తకాలు కూడా ఎక్కడ పడతాయి!"

అంటూ కాసేపు ఓపక్షం, మరి కాసేపు రెండో పక్షం, ఆలోచనలతో మాట్లాడుతూ, తనతో తనే సంభాషణ, ఇద్దరున్నట్లు నడుపుకొంటూంది. పాప. కాసేపటికి బైట ఏదో గొంతుక వినబడి, పాప తన మాటలు ఆపేసి, వినటం మొదలుపెట్టింది.

"అప్పలమ్మా! అప్పలమ్మా! ఓసేయ్ అప్పలమ్మా ఎక్కడికి పోయావే! ముసుగులూ, విసనకఱ్ఱా త్వరగా తీసుకురా" అన్న కేక వినబడింది. ఆ కేకతో తనకోసం వెనక్కువస్తూన్న కుందేలు తప్పటడుగులూ వినబడ్డయ్.

ఆలస్యం చేసినందుకు పాప ముందు కంగారుపడి వణికిపోయింది. అసలిప్పుడా కుందేలుకన్నా తను

వెయ్యిరెట్లు పెద్దదాన్నయ్యానన్నమాటే పాప మరిచిపోయింది. ఇందాకటి బుల్లిపిల్లగా ఉన్నప్పటిదాన్నే అనుకొని భయంతో వణికిపోయింది. ఆ వణకటంతో ఇల్లంతా కూడా పాప వణుకుకి భూకంపం వచ్చినట్టు గజగజా కదుల్తూ అడలిపోయింది.

ఇంతలో కుందేలు తలుపుదగ్గరకు వచ్చి తలుపు లోపలికి తొయ్యబోయింది. కాని లోపల పాప మోచేయి తలుపుకు గట్టిగా ఆనుకొనిఉండబట్టి తలుపు లోపలికి తోసుకోలేదు. "ఈ తలుపు రావడం లేదే. పోనీ చుట్టూ తిరిగి వెళ్ళి, కిటికీలోంచి లోపలికి వెళ్తాను" అని కుందేలు గట్టిగా అనుకొంది.

"లోపలికి వస్తావుగా! చూస్తాను" అనుకొంటూ పాప కుందేలు కిటికీదగ్గరకు వచ్చిన చప్పుడవగానే, గబుక్కున చెయ్యి చాచి, కిటికీలోంచి కుందేలును పట్టుకుందామని గుప్పిలి విసిరింది.

చేతికేమీ అందలేదు. కాని, ఒక కీచుకేకా, గలగలా అద్దాలు పగిలిన చప్పుడూ వినబడ్డాయి. కుందేలు, అక్కడ ఎక్కడో పడ్డదేమోనని పాప అనుకొంది.

"పాట్ - పాట్" అంటూ కుందేలు కోపంతో కేకలేస్తోంది. "పాటీ - పాటీ - ఎక్కడ చేస్తున్నావురా పట్టడా"

ఇంతలో మరో సన్నని గొంతుక వినబడింది. "ఇక్కడేనండి, తాటిముంజెలు తవ్వుతున్నానండీ" -

అని పట్టడు జవాబిచ్చాడు. "ఛా! తాటిముంజెలు తప్పుతున్నావ్! నా మొహం ఏం కాదూ - ఇల్లావచ్చి నన్ను కాస్త పైకి లాగు"

మళ్ళీ ఇంకొంచెం అద్దాలు పెట్టిచిట్లిన చప్పుడయ్యింది. బహుశా పట్టడు కుందేలును బైటికి లాగాడేమో!

"ఒరేయ్ పట్టా! ఆ కిటికీలో, అది ఏమిటిరా!"

"అదేదో సెయ్యనుకుంటానండి;"

"సెయ్యేంటిరా నీ బొంద, మడ్డి వెధవా! అంత చెయ్యుంటుందిరా కిటికీ అంతా నిండిపోయి, తెలివితక్కువ మొగమా!"

"సిత్తవండీ, కిటికీ అంతా నిండిపోయిన మాట నిజమేనండి, అయినా సెయ్యేనండి బాబూ."

"మరిఅయితే ఆ కిటికీలో చెయ్యెందుకొచ్చిందిరా! ఆ చెయ్యి అక్కడుంటానికేం పనుంది? వెంటనే పోయి, ఆ చెయ్యక్కడనుంచి తీసెయ్యి."

తరువాత కాసేపు నిశ్శబ్దం. అప్పుడప్పుడు రహస్యం మాట్లాడుతున్నట్లుగా గుసగుసలు వినబడుతున్నాయి.

"సిత్తమండి. ఆ సెయ్యక్కడుండకూడదండి, అల్లా ఉండటం నాకూ ఇట్టంలేదండి." కుందేలు రహస్యం చెపుతున్న గొంతుకతోనే, కోపంగా, విసురుగా, "ఓరి పిరికివెధవా! అల్లానుల్చోక, ముందు పోయి ఆ చెయి అక్కడినుంచీ తీసేయ్" అని అంది.

పాప ఇంక ఊర్కోకూడదని, గట్టిగా పట్టుకోపోతున్నట్లు వేళ్లు సాచి, చెయ్యి మళ్ళీ కిటికీలోంచి గాలిలోకి విసరింది.

ఈమాటు ఒక కేకను రెండు కీచుగొంతుక కేకలు వినబడ్డాయి. మళ్ళీ అద్దాలు చిటచిటా ఇంకా ఎక్కువ పగిలిన శబ్దం అయింది, “ఆ చిటచిట పగిలే చప్పుళ్లేమిటో, అన్ని అద్దాలు నేలమీద ఉంటాయా” అనుకొంటూంది పాప.

“మరి ఇప్పుడు వాళ్ళేం చేస్తారో! ఈ కిటికీలోంచి చెయ్యెట్టుకొని నన్ను బైటికి లాగుతారేమో! వాళ్లు అలా నన్ను బైటికి లాగగల్గినా బాగుండునే! ఇక్కడిల్లా ఎంతోసేపు పడిఉండటం ఏం బాగుళ్ళేదు” అనుకొంది పాప.

## 8

పాప కాస్సేపు అల్లాగే ఆగిచూసింది. చివరికి ఒక చిన్న బండి వస్తూన్నట్లు గొణగొణమని చక్రాలచప్పుడు వినబడింది. బండి చప్పుడుతోపాటు, చాలామంది చేరిన రణగొణధ్వనికూడా వినబడుతూంది.

“ఇంకో నిచ్చెన ఏదిరా? నా దగ్గర లేదండి;- అదిగో భీముడుదగ్గిరుందండీ - ఓరేయి భీముడూ, - ఆ నిచ్చె నిల్లా పట్టుకురారా - ఇదిగో ఈమూల నిలేయ్ - కాదుకాదు ముందు రెండు నిచ్చెనలు కలిపి

కట్టు - చాల్లేరా, పరవా లేదు - ఎత్తరా - ఏదీ సగం ఎత్తుకైనా వచ్చాయా? భీముడూ ఆ తాడక్కడి కెగరేస్తున్నా - అందుకోరా - ఇంటికప్పు ఆగు తుందా? ఒరేయ్ భీముడూ, జాగ్రత్త, అక్కడ పెంకులు జార్తాయి - అదిగదిగో పెంకురాల్తోంది - తలకాయలు జాగ్రత్తరోయ్ - (ఠాప్ మని శబ్దము) ఎవడురా ఈ పని చేసింది? భీముడేనా? అరిని! - చివిన్నా గొట్టంలోకి ఎవరు దిగుతార్రా? నేను దిగను- అయితే నేనూ దిగను - భీముడినే పొమ్మనండి - ఓరేయ్ భీముడూ, అయ్యోగు నిన్నే దిగమంటు న్నార్రా-"

అల్లా గొంతుకలన్నీ అస్పష్టంగా వినబడు తున్నాయి.

పాప మళ్ళీ తనలో అనుకోటం మొదలు పెట్టింది.

"అదా సంగతి! భీము డీగొట్టంలోంచి లోపలికి వస్తాడా - ఊఁ! - పాపం ఈ భీము డెవడో? వీడి నెత్తినే అన్నిపనులూ పెట్టి చంపుతున్నారే! ఆ, భీముడిపాటు నా కొద్దుబాబూ - అయినా గొట్టంలోంచి దిగుతూండగానే ఒక్కతన్ను భీముణ్ణి పైకి తన్న గలను" అనుకొంటూ పాప పొగగొట్టంలో, కాలు క్రిందికి దించుకొంది.

భీముడు ఏ జంతువో పాపకు తెలియలేదు. కాసేపటికి చిన్నజంతు వేదో పొగగొట్టం అంచులు

బరువెక్కుంటూ దిగుతున్న శబ్దం దగ్గరదగ్గరకొస్తూ విన
బడింది.

"ఓరి భీముడూ!" అంటూ పాప ఒక్క తన్ను
పైకెత్తన్ని ఏం జరుగుతుందో అని వింటూ కూర్చుంది.
మళ్ళీ ఒక్కసారి కేకలు వినబడక ఆగిపోయాయి.
కుందేలుమాట ఒక్కటే మళ్ళీ వినిపించింది.

"అడుగడుగో భీముడు ఆకాశంలో కెగిరాడు.
ఒరేయ్ పట్టా, కంచెదగ్గర ఉన్నవాళ్లు, వాడికి దెబ్బ
తగలకుండా పట్టుకోండ్రా!"

కాసేపు మళ్ళీ నిశ్శబ్దం. మళ్ళీ గందరగోళంగా
అరుపులు.

"తల పైకెత్తి పట్టండిరా - చుట్టూ మూగ
కండి; వాడికి కాస్త గాలి ఆడనీయండి - కొద్దిగా
బ్రాందీ పొయ్యండిరా - అరే గుటక మింగ
నియ్యండి - అల్లా ఉక్కిరిబిక్కిరి చేయకండి - ఏరా
భీమా! ఇప్పు డెలా ఉంది? - ఏమయిందిరా అంత
ఎగిరిపడ్డావ్? - ఏం జరిగిందో చెప్పరా-"

చివరికి సన్నగా నీరసంగా ఒక కీచుగొంతుక
వినబడింది. (వాడే నను కుంటా భీముడు" అనుకొంది
పాప).

"ఏమోనయ్యా, మీ కెంత తెలుసో నాకూ
అంతే తెలుసండి; ఆ బ్రాందీ చాలు - ఇప్పుడు
కొంచెం తేరుకున్నట్లే ఉంది - కాని ఇంకా ఏమిటో
అయోమయంగానే ఉందండి - ఆ పొగగొట్టం క్రింద

దాకా దిగాననుకున్నాను - ఇంతలో ఏదో ఉండేలు బద్ద వచ్చినట్టు వచ్చి నా మీదికి హఠాత్తుగా వచ్చేసింది - దెబ్బకు, తారాజువ్వ ఎగిరినట్లు ఆకాశంలోకి ఎగిరిపడ్డాను.

"అమ్మ తారాజువ్వలాగే వచ్చావురా." అని తక్కినవాళ్లు అన్నారు.

కుందేలుమాట గట్టిగా వినబడింది :

"ఇక ఒక్కటే మార్గం - ఇల్లు తగలబెడ్దాం" అంది కుందేలు.

"ఆ పని చేస్తే, దీనను సమీదకు పంపిస్తా" అని పాప లోపల్నుంచే అరిచింది:

బైటవాళ్లెవళ్లూ కిమ్మనలేదు.

"ఇంకేం చేస్తారో— తెలివితక్కువ మొహాలు! ఇంటికప్పు ఊడబీకరాదూ!" కాసేపటికి మళ్ళీ బైట కదలికా, కలకలమూ వినిపించాయి: "ముందు ఓ డబ్బాడు అయితే చాల్ననుకొంటాను" అంటోంది కుందేలు.

"డబ్బాడూ, ఏమిటీ?" అని తన్ను తను ప్రశ్నించుకొంది. ప్రశ్నకు జవాబు వెంటనే వచ్చింది. డబ్బాడు రాళ్లు దడదడా ఇంటిమీద కురిసి, కిటికీలోంచి వచ్చి పాప మొహానికి తగిలాయి.

"ఇది వెంటనే ఆపెయ్యాలి" అనుకొంటూ పాప-"ఏయ్, మళ్ళీ విసరకండి; జాగ్రత్త !" అని పాప కేక వేసింది.

మళ్ళీ గప్‌చిప్‌ మని నిశ్శబ్దం.

పాప చూస్తూండగానే ఆ పడ్డ రాళ్ళన్నీ చిన్ని చిన్ని రొట్టెముక్కలవుతున్నాయి. పాపకు మళ్ళీ ఓ తెలివైన ఊహ తోచింది: "ఈ రొట్టెముక్కలు తింటే మళ్ళీ తప్పకుండా మారి తీరుతాను. ఇంతకంటే పెద్దదాన్నయేందుకు వీలులేదు కదా? అంచేత తప్పకుండా చిన్నదాన్నే అవుతాను"

అంటూ పాప రొట్టెలు తిని చూసుకొంటే చిన్నది అవటం మొదలుపెట్టేటప్పటికి, పాపకు బలే సంతోషం వేసింది. తలుపులో పట్టే అంత చిన్నదయే దాకా అల్లాగే ఆ ముక్కలు తిని, తలుపుకు సరిపడగానే, ఇంట్లోనుంచి బైటికి పరుగెత్తుకొచ్చింది. బైటకు వచ్చి చూసేటప్పటికి, పిట్టలూ, పిల్లజంతువులూ అన్నీ మూగి ఉన్నాయి. ఇందాకటి భీము డొక తొండ. ఇంకా దెబ్బనుంచి తేరుకోనేలేదు. తక్కిన వాళ్లు ఇంకా ఏదో మందు తొండకు పోస్తూనే ఉన్నారు.

పాపను చూసేటప్పటికి జంతువులూ, పక్షులూ అన్నీ పాపను తరుముకొంటూ పరుగెత్తుకొచ్చాయి. పాప వాళ్ళను తప్పించుకొని, పక్కనున్న చిట్టడవిలోకి పరుగెత్తుకుపోయింది.

"ముందు నేను నా మామూలు పొడుగుకు ఎదగాలి. తర్వాత ఇందాకటి అందమైన తోటలోకి

దో వేదో చూడాలి. ముందే రెండుపనులూ ముఖ్యంగా చూడాలి - ఇదే మంచి పద్ధతి".

పద్ధతి మంచిదే సందేహం లేదు. అనుకోటము తేలికగానే అయిందిగాని పద్ధతి అమల్లో పెట్టడం ఎల్లాగోమాత్రం పాప కేమీ తోచలేదు. అల్లాగే చెట్ల మానుల్లోంచి ఇటూ అటూ జాగ్రత్తగా చూసు కొంటూ బయలుదేరింది.

ఇంతలో "భౌ భౌ" మన్న కుక్కపిల్ల అరుపు పాప నెత్తిమీద వినబడింది.

ఓ పెద్ద కుక్కపిల్ల పెద్ద మిడిగ్రుడ్లేసుకొని పాపకేసి చూస్తూ, పాపని పట్టుకొందామని పాదం సాచి చెట్లు అడ్డొస్తే చూస్తూ నిలుచుంది.

"పిచ్చికుక్కపిల్ల - పాపం" అంటూ పాప కుక్కపిల్లను మంచిమాట చేసుకొనేమాదిరిగా అంది. ఈలవేయబోయింది. కాని లోపల గుండెల్లో మాత్రం, కుక్కపిల్లకు ఆకలిగా ఉందేమో, గుటు క్కున తన్ను మింగేస్తుందేమో ననే కంగారు ఎక్కువ గానే ఉంది.

ఒక చిన్న కఱ్ఱముక్క పుచ్చుకొని ఆడిస్తూ స్నేహంగా కుక్కపిల్లవైపుకు జూపింది. కుక్కపిల్ల ఒక్క అదటున నాలాగుకాళ్లూ ఎగరేస్తూ ఒక్క గెంతు గెంతి, కఱ్ఱముక్కను నోట్లో కరచుకొని ఆడు కోటం మొదలుపెట్టింది. ఆ ఎగురుడు తొందరలో

కుక్కపిల్ల ముద్దగా తలక్రిందులుగా పడి ఆడు కొంటూఉంది.

కుక్కపిల్ల తనమీద పడుతుందేమో నని పాప పొదల పక్కకి తప్పుకుంది. కుక్కపిల్ల కఱ్ఱముక్కతో ఆడుకొని, ఆయాసంతో నాలు కార్చుకొంటూ కళ్లు మూసుకొని దూరంగా కూర్చుంది. పారిపోడానికి ఇదే మంచి అదననుకొంటూ, పాప అక్కడనుంచి పరు గెత్తింది. పరుగెత్తి పరుగెత్తి, ఆయాసం అలసటా రావటం మొదలు పెట్టాయి. కుక్కపిల్ల అరుపుకూడ, ఎక్కడో దూరాన్నే ఆగిపోయింది.

పాప అలసిపోయి, ఒక మెట్టతామరకాడ నానుకొని నుల్చుంది.

"అయినా ఆ కుక్కపిల్ల ఎంత చక్కగా ఉందో! సరిఅయిన అమ్మాయిగా ఉంటే బాగుండేది కదా. చక్కగా ఆ కుక్కపిల్లకెన్నెన్ని గమ్మత్తు ఆటలు నేర్పుదును. అయ్యో! మళ్ళీ ఎదగాలన్న మాటే మర్చిపోయా నేమిటి. చూద్దాం ఆగు ఏం చెయ్యాలో; ఏం చెయ్యాలి ?"

నిజమే! ఏం చెయ్యాలనేదే ప్రశ్న. పాప ఏవన్నా తినేవిగాని తాగేవికాని కనబడుతాయేమో నని చుట్టూ పువ్వులకేసీ, గడ్డికేసీ చూసింది. దగ్గరలో, తనంత ఎత్తేఉన్న ఒక కుక్కగొడుగు కనబడింది. ఆ కుక్కగొడుగు అంతా పాప కలయచూసింది. పైన ఏముంటుందో నని, కాళ్లు ఎత్తి నుల్చుని రెండు

చేతులా గొడుగుఅంచులు పట్టుకొని మొహసారించి కుక్కగొడుగుపైకి చూసింది.

అక్కడ గొడుగుమీద, ఒక నీలిరంగు పట్టు పురుగు, తిరుబడిగా ముడుచుకొని కూర్చుని, సన్న గొట్టంతో హుక్కా పీలుస్తూ పాప కేసి చూడనట్టుగానే పొగ వదుల్తూ కూర్చుంది.

# 9

పట్టుపురుగూ, పాపా ఒకళ్ళవంక ఒకళ్లు కాసేపు నిశ్శబ్దంగా చూసుకొన్నారు. చివరికి పట్టుపురుగు బద్ధకంగానే హుక్కాగొట్టం కొద్దిగా నోటి వెలపలకి తీసి, అరమూతకన్నులతో, పెదవులు కదిల్చీ, కద ల్చనటుల బద్ధకంగా నిద్రమోతుకంఠంతో "ఎవరు నువ్వు?" అని అడిగింది.

ఆ ప్రశ్న అల్లా అడగటంలో కాసేపు ఏదో కులాసాగా కబుర్లాడుకొందామన్న పాపకు, కబుర్లు సాగే ధోరణేమీ కనబడనట్లుగానే అయింది.

పాప జంకుతూ జంకుతూ జవాబు మొదలె ట్టింది: "నేనాండీ, - నేను - నేను ప్రస్తుతం ఎవరో నాకే సరిగ్గా తెలియటం లేదు అంటే— అదికాదు - అసలు పొద్దున్న నేను నిద్రలేచేటప్పటికి ఎవరో నాకు తెలియదనికాదు - పొద్దున్న అథమం, అదన్నా - నిద్రలేచేటప్పటికి ఎవరో అది తెలు

సును. కాని తర్వాత చాలామాట్లు ఇట్టే ఇట్టే మారి పోయి ఉండా లనుకొంటాను.

పట్టుపురుగు తీవ్రంగా - "అంటే అర్థం ఏమిటీ? నువ్వు చెప్పేదేమిటో సరిగ్గా చెప్పు" అంది.

"నే చెప్పేది సరిగ్గా చెప్పలేనేమో నండి - వచ్చిన తిప్పలు ఏమిటంటే : నేను నేను కాదాయను. చూశారూ?" అంది పాప. "నే నేం చూడలేదు" అల్లాగే కోపంగా అంది పట్టుపురుగు.

"అది కాదండి - అంతకంటే స్పష్టంగా చెప్ప టానికి నాకు కుదురటం లేదు. అసలు ముందు జరిగిన విషయ మేమిటో పూర్తిగా నాకు నాకే అర్థమవటం లేదాయెను. ఒక్కరోజులో ఇన్నిమాట్లు పొడుగూ, పొట్టీగా మారిపోతూంటే, అంత కంగారుగా ఉండదూ మరి?—"

"ఏం కంగారు లేదు" అంది పట్టుపురుగు.

"లేదూ? బహుశా నీ కింకా తెలిసిరాలే దేమో—ఎందుకూ రేపు నువ్వు పట్టుపురుగునుంచి, గూడుపురుగువై, గూడుపురుగునుంచి మళ్ళీ రెక్క లొచ్చి సీతాకోకచిలక వైతే, అప్పుడు నీకు మరి ఏమిటో అంతా విపరీతంగా అవుతూన్నట్టు అనిపిం చదూ? ఏం? అనిపిస్తుందా? అనిపించదా"

"ఏమీ అనిపించదు."

"పోనీలే నీ కనిపించ దేమోలే ! ఒకొక్కళ్ల

దొక్కా కర్క తీరు ' నాకు మాత్రం నా అనుభవాన్ని బట్టి చాలా విపరీతంగానే ఉంది"

"నీకు - అసలు నువ్వెవరంటూంటే" అంటూ పట్టుపురుగు నిస్సారంగా గదమాయించింది.

సంభాషణ మళ్లీ మొదటికొచ్చింది. అదీ కాకుండా, పట్టుపురుగు చిరాకు ధోరణితోటి పాపకు మండుకొస్తూంది. ఒక్కసారిగా నిటారుగా నిలబడి మహాతీవ్రంగా—

"అసలు, ముందు, నువ్వెవరో నాకు చెప్పాలి అనుకొంటాను - "

"ఎందుకేం?" అంది పట్టుపురుగు.

పాపకు మళ్ళీ సమస్యే తయారయింది - ఎందుకంటే? - ఎందుకేమిటి - అయినా ఎందుకు చెప్పాలో సరిఅయిన కారణం కూడా పాపకు తోచలేదు. పట్టుపురుగు చిరాకుధోరణి చూస్తే, ఇక నుల్చుని మాట్లాడటం అనవసరం అన్నట్టు అనిపించి, పాప అక్కడనుంచి అవతలకు పోదామని వెనక్కితిరిగి రెండడుగులు వేసింది.

"ఏయ్, ఇల్లా రా! నిన్నే. నీకో మాట చెప్పాలి" అంటూ పట్టుపురుగు పాపను వెనక్కు పిలిచింది.

"పోనీలే, కాస్త ధోరణ మారింది కాబోలు" అనుకొంటూ పాప వెనక్కి తిరిగివచ్చింది.

"కాస్త కోపం మింగటం నేర్చుకో!" పాపకు ఒళ్ళు మండుకుపోయింది. అయినా కోపం దిగమ్రింగ టానికి ప్రయత్నిస్తూ -

"చెప్పటం అయిందా అండి!" అని బిగదీసు కొని అడిగింది.

"కాలేదు!" అంటూ కళ్లు మూసుకొంది పట్టు పురుగు.

పనేమీ లేనప్పుడు, పోని కానీపాగే, ఏం చెప్తుందో, ఏమో ఒకవేళ మంచిముక్కే ఏమన్నా చెపుతుందేమో, విందాం, అనుకొంటూ పాప ఆగి నుల్చుంది. పట్టుపురుగు నిదానంగా హుక్కా పీలుస్తూ పొగ వదులుకొంటూ మాట్లాడకుండ కూర్చుని కూర్చుని, చివరికి మళ్ళీ ఎల్లాగో కాస్త హుక్కా గొట్టం పక్కకు తీసి -

"సరి! అయితే నువ్వు ఏదో మారిపోయినట్టుగా అనుకొంటున్నా వన్నమాట." అంది.

"ఔనండీ- మారిపోయానేమో అనే భయంగా ఉందండీ. మునుపటిలాగ నాకొక్క విషయమూ జ్ఞాపక ముండటం లేదు - పట్టుమని పది నిముషాలు ఒక్క ఎత్తున ఒక్క మాదిరిగా ఉండటమే పడటం లేదు." -

"ఏం విషయాలు జ్ఞాపకం లేవూ?" అంటూ పట్టుపురుగు ధీమాదాగా అడిగింది.

"ఏమీ లేవు - ఎందుకు, ఇందాక "అనగనగ నొక్క మావుండె నొక యూర" చెప్దా మనుకొంటే అంతా ఇంకోమాదిరిగా వచ్చింది."

"'కాళ్ళాగజ్జీ', అప్ప చెప్ప" అంది పట్టుపురుగు.

పాప చేతులుకట్టుకొని పంతులమ్మముందు అప్పజెప్పినట్లు చెప్పడం మొదలుపెట్టింది:

"కాళ్లాగజ్జీ, చేతుల చిడుమూ,
ముక్కులోపక్కు, చెవిలో గువిలీ,
నోట్లో చొంగా, నొసటను చెమటా,
రాజుగారి దొడ్లో ఏముందటంటే,
రాజుగారి దొడ్లో పిల్లిచచ్చింది;
చంపిన ఎలుకను చంపేస్తారోయ్
ఎక్కడ దొంగ లక్కడ గప్‌చిప్!"

అని అప్పచెప్పి, "ఊఁ! కాదు - 'కాలుతీసీ కడగాపెట్టూ' రావాలి; ఎక్కడో అక్కడక్కడ తప్పి వట్టుంది" అని గట్టిగా అనుకొంది.

"అంతా తప్పే. మొదటినుండి చివరిదాకా శుద్ధ తప్పు" అంది పట్టుపురుగు పంతులమ్మలాగే!

కొన్ని నిమిషాలదాకా ఇద్దరూ మాట్లాడలేదు. చివరికి పట్టుపురుగు మళ్ళీ అడగటం మొదలెట్టింది.

"నీవు ఎంత ఎత్తుకు మారాలని ఉంది?" అని పట్టుపురుగు అడిగింది.

అయినా, పాప చివరికి రెండు చేతులూ కుక్క గొడుగు అంచుకే రెండు వైపులకూ చుట్టూ సగం దాకా చాచి, రెండు చేతులతోటీ చెరో కాస్త, ఆవైపూ ఈవైపూ కాస్త అంచుముక్క తుంపింది. తుంపి, కుడిచేతిలో ముక్క పంటితో సరిగ్గా కొరికిందో లేదో, ఇంతలో గడ్డానికేదో ఠక్కున కొట్టుకొంది. తీరా చూస్తే తన పాదమే గడ్డానికి కొట్టుకొంది!

ఇంత త్వరగా హఠాత్తుగా కుంచుకుపోయేటప్పటికి పాప ముందర హడలిపోయింది. కాని వెంటనే ధైర్యం తెచ్చుకొని, ఆలస్యంచేస్తే ఇంకా కుంచుకుపోతామని, వెంటనే ఎడమచేతిలో ముక్క కొరుకుదామని నోటిదగ్గిరకు తెచ్చుకొంది. పెదవులు తెరుద్దామంటే, పాదం గడ్డంక్రింద గట్టిగా నొక్కేస్తూంది. బలవంతంగా ఎల్లాగో నోరు తెరుచుకొని పాప రెండవ చేతిలో ముక్క కాస్త కొరికింది...

"అమ్మయ్య! కాస్త ఇప్పుడు, తల విశ్రాంతిగా తిప్పుకోటానికి వీలువచ్చింది" అనుకొంటూ పాప ముందు సంతోషపడింది. కాని ఆ సంతోషం ఒక్కక్షణంలోనే మాయమయి కంగారుపుట్టింది - తీరా చూసుకుంటే పాపకు తన బుజాలే తనకు ఎక్కడా కనబడటం లేదు - మెడ ఒక్కటే పొడుగుగా; గొట్టంలాగా, తామరకాడలాగ, పచ్చని సముద్రంలోనుంచి ఎక్కడో క్రిందగా ఉన్న చెట్లఆకులు గడ్డి అల్లా కన

బడుతున్నాయి. ఎత్తుగా మొలుచుకొచ్చినట్లు మెడ ఒక్కటి మాత్రమే కనబడుతూంది.

"ఆ పచ్చనిదంతా ఏమిటో? మరి నా బుజాలు అవీ ఏమిఅయాయి? నాచేతు లేమవుతూయి? అయ్యో చేతుల్లారా, కనబడకుండా అక్కడికి పోయారే?" పాప చేతులు కదుపుతోంది; కానీ ఎక్కడో అడుగునో గడ్డిలో ఏదో కాస్త కదిలిక కదిలినట్లు తప్ప మరేమీ కనబడటం లేదు.

ఇంక చేతులు మొహం దగ్గరకు తెచ్చుకోటానికి వీలులేకపోయేటప్పటికి, పోనీ తలకాయను చేతుల దగ్గరకు వంచవచ్చేమో నని చూసింది. అదృష్ట వశాత్తూ పాప మెడ పాము మెడలాగా, అల్లా మెలికలు తిప్పాలనుకొంటే అలా తిప్పటానికి వీలుగా ఉందని చూసేటప్పటికి పాపకు కాస్త సంతోషం వేసింది. మెడ అందంగా మెలికలు మెలికలుగా కిందికి వంచి, ఆకుల్లోకి తల దూరుద్దా మనుకుంటూంది. ఆ ఆకులు కూడా, ఇందాకటినుంచి తనకు పెద్దవి పెద్దవిగా కనబడ్డ చెట్లపై ఆకులే. అల్లాగే మెడ మెలికలు తిప్పుతూ కొమ్మల్లోంచి క్రిందికి వంచుతోంది.

ఇంతలో మొగాన్న "ఉస్" అని కీచుగా ఎవరో ఊదినట్టుండేటప్పటికి, గబుక్కున తల కాస్త వెనక్కి తీసికొని పరకాయించి చూచింది. ఒక పెద్ద పావురం, పాప మొహంచుట్టూ ఎగురుతూ, రెక్కలతో తపతపా పాప మొహాన్ని కొట్టూంది.

"పాము! పాము!" అంటూ పావురం అరుస్తూంది.

"నేను పామును కాను - నా జోలికి రాకు" అంటూ పాప కోపంగా అంది.

"పామువే! పామువి కాకేం" అంటూ కాస్త ఏడుపుకంఠం పెట్టి పావురం బిక్కు-బిక్కుమంటూ "ఎన్నివిధాల ప్రయత్నించాను; ఎన్నివిధాల ప్రయత్నించాను. నాకీ పోరు తప్పడంలేదు కదా-అయ్యో!" అని ఏడవటం మొదలుపెట్టింది.

"నువ్వేం మాట్లాడుతున్నావో నాకేం అర్థం కావటంలేదు" అంది పాప - పాప మాటలు వినకుండానే పావురం ఏడుస్తూంది.

చెట్ల మొదళ్ళల్లో కట్టాను—ఏటి గట్లమీద కట్టాను—పొదల్లో కట్టిచూశాను - ఊహుఁ, ఎక్కడా ఈ పాములు వదిల్తేకదా—వాట్లకు దూరంగా ఉండామంటేనే కుదిరిచావందే !"

పాప కా పావురం అనేదేమిటో అసలే అర్థంకాకుండాపోయింది. అయినా ధోరణి పూర్తిఅయేదాకా తను మాట్లాడి లాభంలేదని మాట్లాడక ఊర్కొంది.

"అక్కడికి గుడ్లు పెట్టటం, పొదగటం, ఈ కష్టం నా ప్రాణానికి చాలనట్టు - నిత్యం ఈ పాములను కూడా కాపలా కాస్తూ చావనా - ఎందుకు - మూడు వారాలయి కంటిమీద కునుకు లేదు కదా!"

పాపకు కాస్తకాస్త అర్థం అవటం మొదలు పెట్టింది.

"పాపం వృథాగా నీకు కష్టం కలిగించినందుకు నాకు చాలా విచారంగా ఉంది," అంది.

పావురం ఇంకా కీచుగా గొంతుక పెద్దది చేసుకొని, "అక్కడికీ, అన్నిటికన్నా ఎత్తైన చెట్టు చూసి చిటారికొమ్మను గూడు కట్టుకొని, అమ్మయ్యా బతికాను అనుకొంటూంటే—ఆకాశంలోంచి కూడా, మెలికలు తిరుగుకుంటూ రావాలా! ఛీ! ఏం పాములు" అంటూ గీపెట్టా అరవటం మొదలుపెట్టింది.

"అరె! నేను పామును కాదని చెప్తూంటే - నేను - నేను...."

"కాకపోతే మరేమిటేమిటి - పామువు కాక ఎవరవు? - ఏదో అభూతకల్పన పుట్టిద్దా మనుకొంటు న్నావు - నాకు తెలియదా?"

"నేను పాపను - ఆడపిల్లను" అంటూ పాప నసుగుతూ చెప్పింది. ఒక్కరోజులో ఇన్ని మార్పుల య్యాక, ఇంకా పాపనేనా అని పాపకూ లోపల అనుమానంగానే ఉంది.

"భలే పాపే - పాంట - ఆడపిల్లలు - నే నెక్కడా ఆడపిల్లల్నే చూడలేదనుకొన్నావా? నేను చాలామంది ఆడపిల్లలను చూశాను-కాని ఇంత మెడ ఉన్న ఆడపిల్ల ఎక్కడా లేదు. కాదులే; నువ్వు పామువే - కాదని లాభం లేదు - ఇంకనలు పక్షిగ్రు

డ్లల్లా ఉంటాయో చూడనే లేదని బొంకుతావు గాబోలు !"

"పక్షిగుడ్లు ఆడపిల్లలు మాత్రం చూడరా? పాము లెక్కటేనా చూసేది?" అని అడిగింది పాప.

"చూసేవాళ్ళు ఒకరకం పాములే నన్న మాట" –అంది పావురం.

చిన్నిపిల్లలు పాములనుకోవటం పాపకు కొత్తగా కనబడి పాప కాస్త ఆగి ఆలోచిస్తోంది. ఆ అదను చూసి, పావురం–"అసలు నువ్వు గుడ్ల కోసమే వెదుకుతున్నావు– నా కామాత్రం తెలియ దనుకున్నావా? అల్లా వెదికేటప్పుడు పామువైనా, పిల్లవైనా నా కొకటే" అంది.

"నీ కొకటేనేమో, నాకు మాత్రం బలే తేడా కనబడుతూనే ఉంది. అయినా అసలు నేను నీ గుడ్ల కోసం వెదకడమే లేదు. వెదక దలచుకుంటే పావురం గుడ్లే కావాలా ఏంటి"–అంది పాప.

"అయితే మరి అవతలికి నడు" అంటూ ముగం మాడ్చుగా పావురం తన గూటికి చేరుకొంది.

పాప చెట్లక్రిందికి మెడ సాచగలిగినంత క్రిందికి వంగింది. మధ్యమధ్య మెడ చెట్లకొమ్మల్లో మెలికలు పడుతూంటే, సర్దుకొని సరిచేసుకొనేది.

కాసేపటికి, ఇందాకటి ముక్కలు రెండు చేతుల్లోనూ ఇంకా అల్లా మిగిలే ఉన్నాయని పాపకు జ్ఞాపకం వచ్చింది. ఈమాటు, జాగ్రత్తగా, రెండు

ముక్కల దగ్గిరకు తలపోనిచ్చి, కాస్త ఓ ముక్కా, కాస్త ఓ ముక్కా లెఖ్ఖగా కొరుకుతూ పొడుగూ, పొట్టీ అవుతూ, చివరికి సర్దుకొని తింటంవల్ల, ఎల్లాగో తెలివిగా, తన మామూలు పొడుగుకు వచ్చింది.

"అమ్మయ్య! ఎల్లాగో ఓ గండం గడిచి గట్టెక్కాను. ఇక్కడికి సగం పని పూర్తిచేసుకొన్నట్లే - ఎల్లాగో మామూలు పాపగా అయాను- ఇంక తోటలోకి బయల్దేరాలి - ఎలా వెళ్లటం-దో వేదో" అంటూ ఆశ్చర్యపోతూ తనలో తను మాట్లాడుకొంటూ పాప బయలు దేరింది.

వచ్చి వచ్చి బయలు జాగాకి వచ్చేసింది. అక్కడో చిన్న నాలుగడుగుల ఎత్తు ఇల్లు ఉంది.

"ఆ యింట్లో ఎవళ్లుంటారో? అయినా ఈ మామూలు రూపంలో ఆ చిన్న యింట్లోకి వెళ్తే అక్కడివాళ్లు అదిరి బెంబేలెత్తిపోరూ ? కుడిచేతిలో ముక్క జాగ్రత్తగా కొరికి తొమ్మిది అంగుళాల ఎత్తు అయాక, లోపలికి పోతాను." అంటూ అతి జాగ్రత్తగా, తొమ్మిది అంగుళాల ఎత్తుకు తను వచ్చేదాకా, గొడుగుముక్క నమిలి-ఆపైన ఇంటివైపుకు కదిలింది.

## 10

రెండు మూడు నిమిషాలదాకా, ఆ యింటివంక పరకాయించి చూస్తూ ఇకముందు ఏం

చెయ్యాలో తెలియక ఆలోచిస్తూ పాప, ఆయింటి దగ్గరఉన్న పొదలదగ్గిర అల్లాగే నుల్చుంది. ఇంతలో వెనుక అడివిలోనుంచి ఒక బంట్రోతు పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆ తలపాగా, ఆ డవాలాబిళ్ళ, ఇత్తడి బొత్తాముల కోటూ, అవీ చూసి బంట్రోతు అనుకోవలసిందే కాని, వాడి మొహం చూస్తే చేపలాగే ఉన్నాడు. ఆ చేపబంట్రోతు, అల్లా పరుగెత్తుకుంటూ వచ్చి, ఇంటి తలుపు దబదబా బాదటం మొదలు పెట్టాడు.

తలుపు తెరుచుకుంటూ లోపల్నుంచి ఇంకో బంట్రోతు వచ్చాడు. ఈ బంట్రోతు మొగం, కళ్ళూ కప్పలాగా గుండ్రంగా పెద్దవిగా ఉన్నాయి. వేషం మాత్రం ఇందాకటి వాడికి లాగానే తలపాగా, ఇత్తడి బొత్తాముల కోటు, డవాలాబిళ్ళ అన్నీ పెద్ద ఇంటి బంట్రోతువేషం అంతా ఉంది. ఇద్దరికీ తలపాగాలకు తోక లున్నాయి. అవి వీపుమీద వేలాడుతూ, మొగం తిప్పినప్పుడల్లా మెడచుట్టూ గిఱ్ఱున తిరుగుతూ, చుట్టుకొంటున్నాయి.

వాళ్ల ఇద్దరినీ చూస్తుంటే పాపకు ఆశ్చర్యంగానే అనిపించింది. అయినా ఏం మాట్లాడుతారో విందామని కాస్త దగ్గరగా పొదల మాటుకు చేరింది.

చేపబంట్రోతు తన చంకలోనుండి ఒక పెద్ద కవరు తీశాడు. ఆ కవరు దాదాపు అతనంత ఎత్తూ ఉన్నది.

అతనా కవరు అతిభద్రంగా రెండు చేతుల తోనూ పట్టుకొని, పూర్తిగా సలాం చేస్తున్నట్టు వంగి, కప్పబంట్రోతు కందిస్తూ "జమీందారిణి గారికి, రాణీగారిదగ్గిరనుంచి—ప చ్చీ సు ఆ ట కు రావలసిందిగా ఆహ్వానము'' అని అతి గౌరవంగా అంటూ, కప్పబంట్రోతు కందిచ్చాడు.

కప్పబంట్రోతు ఆమాటలే, కాస్త తారు మారుగా అందిపుచ్చుకొని, "రాణీగారిదగ్గిరనుంచి-పచ్చీసుఆట ఆడేందుకు రమ్మని జమీందారిణీగారికి ఆహ్వానము" అని అచ్చు చేపబంట్రోతు అన్నట్టే అతిగౌరవంతో, ఏదో వేదం చదువుతూన్నంత గంభీరంగా అన్నాడు.

ఆ మాటలని ఇద్దరూ ఒకళ్ళ కొకళ్ళ కెదురుగా నుల్చుని వంగి సలాముచేస్తూ తలాతలా డీడిక్కొట్టుకొన్నారు. ఇద్దరి తలపాగాల తోకలు కలిసి మెలికి పడిపోయాయి.

పాపకు వాళ్ళను చూస్తుంటే అమితంగా నవ్వొచ్చింది. తన నవ్వు వాళ్లు వింటారేమోనని, పొదల చాటుకు వెనక్కి నక్కింది.

కాసేపుండి పాప మళ్ళీ పొదల్లోంచి తొంగి చూచింది. చేప బంట్రోతు లేడు. కప్పబంట్రోతు ఒక్కడూ, తలుపు బైట నేలమీద కూర్చుని, ఆకాశం వైపు వెర్రిగా తేరగుడ్లెట్టుకు చూస్తూ కూర్చున్నాడు.

పాప భయం భయంగా తలుపుదగ్గిరకు నడిచి నెమ్మదిగా తలుపు కొట్టింది.

"తలుపు కొట్టి లాభంలేదు" అంటూ బంట్రోతు మొదలుపెట్టాడు—"ఎందు కంటావా, రెండు కారణా లున్నాయి. ఒకటేమో, తలుపు తియ్య వలసినవాడను నేనూ, నీలాగే తలుపుకు ఇవతల ఎక్కడనే ఉన్నానాయను. మరింక రెండోది, లోపల అంత గల్లంతుగా ఉంటే నీ తలుపు కొట్టటం లోపలి వాళ్లకు ఎవళ్లకూ వినబడదు."

నిజంగాకూడ లోపల చాలా గల్లంతుగానే ఉంది. లోపలఎవళ్లెవళ్లో కేకలూ, పెడబొబ్బలూ, పెట్టు న్నారు. ఏడుపులూ, 'ఆచ్' 'ఆచ్' అని రావణా తుమ్ములూ తెరిపిలేకుండా వినబడుతున్నాయి. ఉండి ఉండి, పళ్లెమో, కప్పో, సాసరో, ఏదో ముక్కలు ముక్కలుగా పగిలిపోతూన్నట్లు చప్పుళ్లు వినబడుతు న్నాయి.

"మరి నేను లోపలి కెళ్లటం ఎల్లా?" అని పాప అడిగింది. కప్పబంట్రోతు పాపమాటలు వినకుం డానే తన ధోరణి సాగించాడు.

"తలుపు అవతల ఒకళ్లం, ఇవతల ఒకళ్లం ఉండిఉంటే నువ్వు తలుపు తట్టినా, ఏమన్నా అర్థం పర్థం ఉండేది. చూడు; నువ్వు లోపల ఉన్నావనుకో, నేనిక్కడున్నాననుకో, లోపలినుంచి నువ్వుతలుపుతట్టితే

నే నిక్కడనుంచి తలుపు తీసి నిన్ను బైటికి పోని ద్దును -"

మాట్లాడుతూన్నంత సేపూ కప్పబంౖటోతు కళ్లు పాపవంక లేకుండా ఆకాశంలోకే చూస్తుంటే, పాపకు చాలా అమర్యాదగా అనిపించింది. వెంటనే తనలో తనే సద్దుకొంటూ, "ఆ, అసలు పాపం వాడికళ్లే అంతే నేమో? అవి అంత నెత్తిమీద ఉంటే, ఆకాశం తప్ప వంక ఎల్లా చూస్తాడు? అయినా పోనీ, మాటకు జవాబు చెప్పొచ్చుగా, అదీ చేయడేం?-" అనుకొని, ఈమాటు గట్టిగా- "నేను లోపలికి వెళ్లటం ఎల్లా?" అని అడిగింది.

"నే నిక్కడే కూర్చుంటాను - రేపటిదాక -" అంటూ కప్పబంౖటోతు ఇంకా ఏదో మాట్లాడుతుం డగానే తలుపు బడాలున తెరుచుకొని, ఒక పెద్ద పళ్ళెం, గిరగిర తిరుగుతూవచ్చి, విసురుగా బంౖటోతు తలమీదగా ముక్కును రాసుకొంటూపోయి,దూరాన చెట్టుకు తగిలి ముక్కలుముక్కలుగా పగిలిపోయింది.

కప్పబంౖటోతుమాౖతం ఏమీ జరగనట్లే అల్లాగే కూర్చుని, ధోరణిలో ఏమీ మార్పు లేకుండా-

"రేపటిదాకా ఇల్లాగే కూర్చుంటాను-బహుశా ఎల్లుండిదాకా కూడా నేమో -" అంటూ సాగిం చాడు.

పాప ఇందాకటికన్నా ఇంకా పెద్దగొంతుకతో "నేను లోపలి కెళ్లటం ఎలాగా?" అని అరుస్తూ అడిగింది.

"అసలు నువ్వు లోపలి కెందు కెళ్లాలి! ముందదీ తేల్చాల్సిన ప్రశ్న; తెలిసిందా?" అన్నాడు బంట్రోతు.

నిజమే. అయినా పాపకు ఇంకోళ్లలా అనటం ఇష్టం లేదు.

"పాడుగోల! ఇక్కడ ప్రతివాళ్లూ ప్రతిదానికీ వాదనలూ అడగటాలూనూ! పిచ్చెత్తిపోతుంది ఎవళ్లకైనా" అంటూ తనలో తను గొణుగుకోటం మొదలు పెట్టింది.

ఈ కాస్త తీరుబడి దొరికేటప్పటికి, మళ్లీ కప్ప బంట్రోతు తన మాటలు పునశ్చరణం చెయ్యటం మొదలుపెట్టాడు.

"ఆ! నే నిక్కడే కూర్చుంటాను - అస్తమానం కూర్చుంటాను - రోజుల తరబడి కూర్చుంటాను."

"మరి నేనేం చెయ్యను?" అని అడిగింది పాప.

"నీ యిష్టం - ఏమన్నా చెయ్యి" అని బంట్రోతు ఈలవేసుకోటం మొదలుపెట్టాడు.

"వీడితో మాట్లాడి లాభం లేదు. శుద్ధ మొద్దు స్వరూపంలా వున్నాడు" అనుకొంటూ పాప తలుపు తోసుకొని లోపలికి వెళ్లింది.

తలుపు నరాసరి వంటయింట్లోకి తెరుచుకొంది.

గది అంతా ముంతపొగ పెట్టినట్లు పొగతో నిండిపోయి ఉంది. గది మధ్యన ఒక ముక్కాలిపీట మీద జమీందారిణీ కూర్చుని ఒళ్లోఉన్న చంటిపిల్లను సాకుతూంది. గాడిపొయ్యిమీద ఉన్న కళాయిమీదికి వంగి, వంటలక్క గరిటెతో కళాయిలో తిప్పుతూంది. కళాయిగిన్నెనిండా పులుసో, ఏదో కుతకుతలాడు తూంది. అందులోంచి వచ్చే మిరియాల పోపుఘాటు, ముక్కులూ కళ్లూ నిండి, ఉక్కిరి బిక్కిరి చేస్తూంది.

పాపకు ఆ ఘాటుకు తుమ్ములు వస్తున్నాయి. ఆ తుమ్ములతోనే, "పోపులో మిరియాల కోరు మరీ ఎక్కువైనట్లుంది" అనుకొంది.

నిజానికి 'కోరు' ఎక్కువగానే ఉంది. జమీందారిణి కూడా మధ్యమధ్య తుమ్ముతూనే ఉంది. ఇక పసిపిల్ల, అ_స్తమానం తుమ్ముతూ, తుమ్ములు ఆగినప్పుడు పెడబొబ్బలు పెట్టూ, మళ్లీ తుమ్ముతూ ఏడుస్తూ ఉంది. వంటింట్లో తుమ్ములు రానివాళ్లల్లా వంటలక్కా, ఒక బావురు పిల్లిని! పిల్లి పొయ్యిదగ్గిరే కూర్చుని, ఈ చెవినుంచి ఆ చెవిదాకా నోరు తెరుచుకొని ఇకిలిస్తూ కూర్చుంది.

ముందు తను మాట్లాడటం మర్యాద ఔనో కాదో అని పాప తటపటాయిస్తూనే - "మీ పిల్లి అల్లా ఎందుకు ఇకిలిస్తూందో దయచేసి చెప్తారా?' అని నసుగుతూ అడిగింది. జమీందారిణి జవాబు

చెప్పింది: "అది దేవరపిల్లి; అందుకని. ఓసి పంది కాదే!"

చివరి మాటలు హఠాత్తుగా కోపంగా అనేటప్పటికి, ముందు తన్నే అంటోందేమో అని కంగారు పడి పాప ఒక్క ఎగు రెగిరింది. తీరాచూస్తే తను కాక, పసిపిల్ల నంటోందని తెలుసుకొని, పాప ధైర్యం తెచ్చుకొని మాటలు మొదలుపెట్టింది.

"దేవరపిల్లులు అస్తమానం అల్లా ఇకిలిస్తాయని నాకు తెలియదే - అస లా మాటకొస్తే, పిల్లులు ఇకిలించగలవనే నాకు తెలియదు-"

"ఆ! యికిలిస్తాయి, అన్ని పిల్లులూ ఇకిలిస్తాయి."

కాస్త ఏదో మాటా మంతీ సాగుతుంది కదా అని పాపకు సంతోషంవేసింది. అతి మర్యాదగా -

"అల్లాగా - అసలు ఇకిలించే పిల్లులను నేను చూడనేలేదు. నాకు తెలిసునే తెలియదు సుమా" అంది.

"నీ కన లేమీ తెలియదు - తెలియ దనేది అక్షరాలా నిజం" అంది జమీందారిణి కటువుగా.

ఆ మాటతీరు పాపకు నచ్చలేదు. అయినా మరే విషయమైనా కబుర్లాడుకోటం నయమని ఏ విషయం ఎత్తుదామా అని పాప ఆలోచిస్తోంది. ఎంతకీ ఆలోచన తెగటం లేదు.

ఇంకా అల్లా ఆలోచిస్తూ ఉండగానే, వంట లక్క కళాయి పొయ్యిమీదనుంచి దింపి, హడావిడిగా, గరిటెలూ, అట్లకాడలూ, చట్రాలూ, తప్పేలాలు, పళ్లాలూ, - చేతి కందినవన్నీ జమీందారిణీ మీదికి పసిపిల్ల మీదికి దబా దబా, విసరటం మొదలు పెట్టింది. పళ్లాలు, గిన్నెలు, వడగళ్ళవర్షం లాగా వాళ్ళిద్దరిమీదా కురుస్తున్నాయి. అవి తగిలినప్పుడు కూడా జమీందారిణి ఏమీ లెఖ్కచేస్తున్నట్టే లేదు. ఇక పసిపిల్ల, అంతకుముందే గగ్గోలుపెట్టి ఏడుస్తూండబట్టీ, ఈ దెబ్బలు బాధ పెట్టున్నాయో లేదో తెలియటమే లేదు.

పాప పళ్లాలు తప్పించుకుంటూ కంగారుగా ఎగిరిపడుతూ "అయ్యో! అయ్యో! ఏం చేస్తున్నావో కాస్త చూడవమ్మా బాబూ" అంటోంది.

ఒక పెద్దపళ్లెం పసిపిల్ల మొహాన్ని రాసుకుంటూ దాదాపు ముక్కు కోసేసిందేమో అన్నంత విసురుగా పోయింది - "అయ్యో! అయ్యో: పసిపిల్ల ముక్కు ఎగిరిపోయిందే" అంటూ పాప అరిచింది.

జమీందారిణి బొంగురు గొంతుకతో గుట్టుగా "ఎవళ్ల పని వాళ్లు చూసుకుంటూ, ఇంకో జోలి పెట్టుకోకుండా ఉంటే, ప్రపంచం ఇంతకన్నా కాస్త తొందరగా అన్నా తిరుగుతుంది" అంది.

పాపకు తన జాగ్రఫీ తెలివితేటలు చూపించేందుకు అవకాశం వచ్చిందికదా అని సంతోషంవేసి

వాగుడు మొదలుపెట్టింది: "ప్రపంచం ఇంతకన్నా తొందరగా తిరిగితే ఏం లాభం ఉంటుంది? ఏం లాభం ఉండదు - రాత్రిళ్లు పగళ్ళు ఎల్లా మారిపోతాయో కాస్త ఆలోచించాము - ఎందుకూ, భూమి తన అక్షంచుట్టూ తానొకసారి తిరిగేందుకు ఇరవై నాలుగు గంటలు పడుతుంది—

"శిక్ష లంటుం దేమిటి? తల కొట్టేయ్ ముందు" అంది జమీందారిణి.

వంటలక్క అంతపనీ చేస్తుందేమోనని పాప ముందు బెదురుగా చూసింది. కాని వంటలక్క మళ్ళీ పులుసు కలియపెడుతూ తన పనిలో తాను మునిగిపోయి, విననట్టే ఉంది. పాపకు 'ఉత్తుత్తదే'—అని ధైర్యం వచ్చి మళ్లీ మాటలు సాగిస్తూంది.

"ఇరవై నాలుగు గంటలే అనుకొంటాను-ఇరవైనాలుగా - లేక ఓవేళ పన్నెండా - నా ఊహ - "

"వెధవ అంకెలు - అంకెలు చెప్పి విసిగించకు నాకు తలనొప్పి -" అంటూ జమీందారిణి పిల్లకు జోలపాడటం మొదలుపెట్టింది.

"ఉళుదుళుదుళు హాయీ
అబ్బి వీపూ పగలవేయీ
తుమ్మితే ముక్కూడదీయీ
ఉళుదుళుదుళు హాయీ
ఏడ్పుకే పుట్టాడు ఏడుపుల వెధవ
కావాలనె విసిగించ 'కయ్యి' మంటాడు

ఉళుదుళుదుళు హాయీా

అబ్బాయి వీపు పగలవేయీా—

అంటూ జోలపాడింది. ప్రతిచరణం చివరా, పసిపిల్లా, వంటలక్కా కూడా, "ఈ, ఈ!" అని గట్టిగా అనుపల్లవి అందుకొనేవాళ్లు. ప్రతిచరణం అయిపోగానే, పిల్లడిని గట్టిగా కుదుపుతూ, ఒక ఎగురు ఎగరేసేది-పిల్ల ఏడుపులో, చరణాల మాటలు కూడా పాపకు సరిగ్గా వినబడేవికావు -

"తుమ్మినప్పూ ముక్కు తుంచేసి వేస్తే
కోరు కలవాబాతు కోలుకొంటాడు
ఏడ్చినప్పూ వెధవ వీపు పగలేస్తే
ఏడ్పుగొట్టూ వెధవ విరగబాతాడూ
ఉళుదుళుదుళూ ఆయీా
యీా! యీా! యీా!"

జమీందారిణి పాట చటుక్కున ఆపి, పసిపిల్లను హఠాత్తుగా పాపమీదకు విసిరేస్తూ "కాసేపు ను వ్యాడించు పిల్లడిని" అంటూ హడావిడిగా గది బైటికి నడిచింది. వంటలక్క ఒక అట్లపెనం జమీందారిణిమీదకు విసిరేసింది గాని, తలుపుదగ్గిర కాస్తలో తప్పించుకొని జమీందారిణి బైటికిపోయింది.

పాప కంగారుగా చేతులు చాచి అందుకొంటూ పిల్లడిని పట్టుకోబోయింది.

# 11

పిల్లడిని పట్టుకోటమే గగనమైపోయింది పాపకు. పీతలాగా కాళ్ళూ, చేతులూ అన్నివైపులకూ తెరుచుకొంటూ, గబుక్కున మళ్ళీ ముడుచుకొంటూ ఎక్కడా పట్టు అందకుండానే ఎగిరెగిరిపడుతూ నార సాగిపోతూ జారిపోతున్నాడు. ఈ చెయ్యి జారిపోతే ఆ చేత్తోటీ, ఆ చెయ్యి జారితే ఈ చేత్తోటీ, కింద పడకుండా, మోకాలు కానించి, ఒళ్ళోకి పైకిలాగుతూ, చేతులు మార్చుకొంటూ నానా ఉత్కృష్టా పడిపోతోంది పాప. బిడ్డ కూడా, సెగలు పొగలు వొదులున్న రైలుఇంజన్లాగా, అతి ఆయాసంగా వగరుస్తూ చేతులూ, కాళ్ళూ, విలవిలా తన్నుకొంటూన్నట్లు ముడుచుకొంటూ పారజూస్తూ, ఉక్కిరి బిక్కిరి చేసేస్తూన్నాడు. ఓ రెండు నిమిషాలకి పాపకి ఆ పిల్లడిని ఎత్తుకునే పద్ధతి కాస్త తెలిసొచ్చి, ఎల్లాగో పిల్లడిని కొద్దిగా అదిమిపట్టుకో గలిగింది. పద్ధతి అంటే ఏమీ లేదు - పిల్లడిని ఉండగా చుట్టేయటం. ఎడం చెవీ కుడి పాదం గట్టిగా కలిపి, మరి సాచటానికి వీల్లేకుండా, గట్టిగా పట్టేసుకోటం.

అల్లా పట్టుకుని, ఇక్కడి పాపాయిని వదలిపెడ్తే వీళ్ళు తప్పకుండా ఇవాళ రేపట్లోనే వీడిని ఇల్లాచంపేయరూ? నాతో తీసికెళ్ళటమే నయం. లేకపోతే పిల్లాడు చచ్చి

పోతాడు గాని, ఇంకేమన్నా ఉందా? అనుకొంటూ పాప ఒళ్లో బిడ్డ నెట్టుకొని గాలిలోకి కదలివచ్చింది.

పాప మాటలు ఎప్పుడూ గట్టిగా అనుకోటమే అలవాటుగా! ఆ చివరి మాటలు అల్లాగే గట్టిగా అంది. ఆ మాటలు ఔ నంటూన్నట్లు, చేతిలో బిడ్డ, "ఘుర్, ఘుర్" అని ఘుర్ఘురించింది.

ఏమి టల్లా ఘుర్ ఘుర్ అంటావ్? పసిపిల్ల అల్లా ఘుర్ ఘుర్ అనకూడదు; తప్పు! అంటూ పాప, పిల్లను కోప్పడింది.

కాని చేతిలో పిల్ల మళ్ళీ "ఘుర్ ఘుర్" అంది.

'ఇదేమిటి, ఇలా అంటుంది?' అని తెల్లపోతూ పాప పిల్ల మొహంవంక పరకాయించి చూసింది. ముట్టెలాగుం దేమిటి - ముక్కా-నా? మరీ మారిపోతు న్నట్టుంది. పసిపిల్లలకు మరీ ఇంత చికిలి చిన్ని కళ్లుం టాయూ? ఏడుపో, వెక్కి-లో పెట్తోందేమో. ఆ దేం గొంతుకలోంచి గుఱకలాగా అల్లా వినబడుతుంది.' అని కళ్లవంక మళ్ళీ తేరిపారచూసి, "ఏడుపైతే మరి కళ్లనీళ్లు లేవేం? ఇదిగో పిల్లా, పందిపిల్లగా మారా వంటే నీవంక చూసేదిలేదు. ఊఁ! తెలిసిందా?" అని పిల్లతో అంది.

పిల్ల మళ్లీ, వెక్కి-లు, (వెక్కి-లో గుఱకో మరి) పెట్తోంది. అల్లా కాసేపు గడిచింది.

"ఇంటి కెళ్ళాక ఈ పిల్ల నేం చెయ్యను ?"

అనుకొంటూ పాప తెల్లపోతూండగా, ఈమాటు పిల్ల మరీ గట్టిగా "ఘుర్ ఘుర్" మంది. పాపకింక నిశ్చయ మైపోయింది. "అనుమానం లేదు; ఇది పందిపిల్లే. పందిపిల్ల నెత్తుకోటం ఏమిటీ? ఛీ!" అనుకొంటూ పాప పిల్లను చటుక్కున నేలమీద దించింది. పందిపిల్ల పరుగెత్తుకొంటూ పొదల్లోకి పారిపోయేటప్పటికి "అమ్మయ్యా!" అనుకొని పాప ఓ నిట్టూర్పు విడిచింది.

ఆ పిల్ల ఎదిగితే మరీ అసహ్యంగా తయారౌను. కాని పందిపిల్లగా చూస్తే బాగా చక్కగానే ఉందే! పాప తను ఎరిగున్న పిల్లలలో పందిపిల్లలుగా ఉంటే బాగుండే పిల్లలు ఎవరెవరు అని ఆలోచించడం మొదలెట్టింది.

"చాలామందే ఉన్నారు. అల్లా వాళ్ళని పంది పిల్లలుగా మార్చడం ఎల్లాగో తెలిస్తేనా! -"

అంతవరకూ అనుకొంటుండగానే అకస్మాత్తుగా పాపకు ఇందాకటి దేవరపిల్లి, అక్కడే పది గజాల దూరంలో ఒక చెట్టుకొమ్మమీద కూర్చుని ఇకిలిస్తూ కనబడింది.

పాపను చూసి పిల్లి ఇకిలించటం తప్ప మరేమీ చెయ్యటంలేదు. కాస్త మంచి పిల్లిలాగా పాపకు అనిపించింది. అయినా దాని గోళ్లూ, ఆ నోటినిండా పళ్ళూ, మరీ వాడిగానే కనపడుతున్నాయి. అందుకని కాస్త మర్యాదగా మంచిమాట చేసుకొంటే నయమని పాపకు అనిపించింది.

"దేవరపిల్లీ!" అని తనలో "ఓవేళ, బావురు పిల్లీ, అనాలేమో. అయినా కోపం వచ్చిందో లేదో చూడాలి" అనుకొంటూ నిల్చుంది. పిల్లి ఇంకొంచెం ఇకిలించింది. "పోనీలే! ఇంతవరకూ కోపం వచ్చినట్లు లేదు" అనుకొని ధైర్యం తెచ్చుకొని "ఓ పిల్ల మ్యాఁయ్! మంచిదానవుగాని, నేనిక్కడ నుండి ఎల్లా వెళ్ళాలో కాస్త దయచేసి చెప్పవూ?" అని అడిగింది.

"నువ్వెక్కడికి వెళ్ళాలో తెలిస్తే దాన్ని బట్టి చెప్పాల్సి ఉంటుంది" అంది పిల్లి.

"ఫలానా చోటికి వెళ్ళాలని నా కేమంత ఇది లేదు—."

"అల్లా అయితే, ఎల్లా వెళ్ళినా ఫర్వాలేదు" అంది పిల్లి.

"ఎక్కడికో ఒకచోటికి అసలు వెళ్ళగల్గితే చాలు" అని పాప తనమాట పూర్తిచేసింది.

"అది ఎలాగా జరిగేదే? - ఎక్కడికో ఒక చోటికైతే,—కాస్త కాలు కదిపి నడిస్తేసరి, తప్ప కుండా చేరుకుంటావు."

పిల్లి చెప్పే మాటా కాదనేట్టు లేదు. అందుకని ఇంకోమాదిరిగా అడుగుదామని పాప మళ్ళీ అడగటం మొదలు పెట్టింది.

"అది కాదు. ఈ చుట్టుపక్కల ఎల్లాంటి వాళ్ళుంటారు" అని అడిగింది.

"ఆ వేపు వెళ్తే, వెఱ్ఱి వెంగళాయ్ ఉంటాడు. ఈ వేపు వెళ్తే తొట్టికుందేలు ఉంటుంది. నీయిష్టం— ఎటు వెళ్తే అటు వెళ్లు. ఇద్దరూ పిచ్చివాళ్ళే" అంటూ పిల్లి కుడిపాదం ఒకవైపూ, ఎడమపాదం ఒకవైపూ చూపిస్తూ చెప్పింది.

"కాని, నేను పిచ్చివాళ్ళ మధ్యకు వెళ్ళాలను కోటం లేదు" అంది పాప.

"వెళ్ళక ఎల్లా కుదుర్తుంది?—ఇక్కడ అంతా పిచ్చివాళ్ళమే ఆయెను. నేను పిచ్చిదాన్ని. నువ్వు పిచ్చిదానివి" అంది పిల్లి.

"నేను పిచ్చిదాన్నని నీకెల్లా తెలుసు"

"పిచ్చిదానవే. పిచ్చిదానవు కాకపోతే ఇక్కడకు రానేరావు—"

అదేం సబబో పాపకు తెలియనే లేదు.

"సరే, పోనీ! నువ్వు పిచ్చిదానవని నీకెల్లా తెలుసు" అని పాప అడిగింది.

"ఎల్లా తెలుసా ? చెప్తా విను. అసలు కుక్క పిచ్చిది కాదని ముందు ఒప్పుకుంటావా ?"

పిచ్చికుక్క లుంటాయని పాపకు జ్ఞాపకం వచ్చింది. కాని, వాదం ఎందుకనుకొని సరే, ఔను అని ఒప్పుకొంది.

"కుక్కకు సంతోషం వస్తే తోక ఆడిస్తుంది. కోపం వస్తే, గుఱ్ఱుమని పళ్ళు బైటపెట్తుంది. మరి నేను సంతోషం వస్తే గుఱ్ఱుమని పళ్లు ఇకిలిస్తాను. కోపం

వస్తే తోకాడిస్తాను. అందుచేత నేను పిచ్చిదాన్ని. తెలిసిందా ?"

"నువ్వు గుఱ్ఱుమనవు; మ్యావు అంటావు" అంది పాప.

"నీ యిష్టం, ఏదన్నా అనుకో. నువ్వు రాణీ గారితో పచ్చీసుఆటకు వెళ్తున్నావా ?" అని అడిగింది పిల్లి.

"లేదే. నన్నెవళ్ళూ పిలవలేదు. నాకూ వెళ్లాలనే ఉంది" అంది పాప.

"అక్కడ మళ్ళీ కనబడతాలే" అంటూ పిల్లి అక్కడే అదృశ్యమై పోయింది.

అన్ని తమాషాలకూ అలవాటుపడి ఉంది గాబట్టి, పిల్లి మాయమవటం, పాపకు మరీ అంత ఆశ్చర్యం కల్గించలేదు. పిల్లి మాయమైనచోటుకేసే చూస్తూ నిల్చుంది. మళ్ళీ పిల్లి హఠాత్తుగా అక్కడ ప్రత్యక్షమైంది.

"అన్నట్టు అడగటం మర్చిపోయాను. ఇందాక ఆ పిల్లవిషయం ఏమైంది ?" అని పాపను అడిగింది.

"ఆ పిల్ల పందిపిల్లగా మారిపోయింది" అంటూ తడుముకోకుండా, ఆపిల్లి అల్లా కనబడి అడగటంలోగాని, ఆ పిల్ల అల్లా మారిపోటంలోగాని ఏమీ వింత లేనట్లుగా, పాప మామూలుగా జవాబు చెప్పింది.

"అల్లాగే ఔతుం దనుకొన్నాను." అంటూ పిల్లి మళ్ళీ మాయమైంది.

మళ్ళీ పిల్లి కనబడుతుందేమో నని పాప కాసేపు అల్లాగే చూస్తూ నిలబడింది. ఇక కనబడక పోయేటప్పటికి తొ ట్లకుందేలుఇల్లు ఉందని పిల్లి చెప్పిన వైపుకు నడుస్తూ రెం డడుగులు వేసింది.

"వెఱ్ఱివెంగళాయిలను చాలా మందినే చూశాను. అందుకని తొ ట్లకుందేలునే పోయి చూస్తాను. అంటే ఏమిటో, ఎల్లా ఉంటుందో— తొట్లలో ఉంటే బాగా పిచ్చిపిచ్చిగా ఉంటుంది గాని ఇక్కడ తొ ట్లలేం లేవుగా; అందుచేత మరీ అంత పిచ్చిగా ఉండదేమో ?" అనుకొంటూ మళ్ళీ కాస్త తలెత్తింది.

పిల్లి మళ్ళీ కొమ్మమీద ప్రత్యక్షమయి—

" 'పంది' అన్నావా, 'కంది' అన్నావా? ఏమిటీ అన్నావు ?" అని అడిగింది.

" 'పంది' అనే అన్నాను. అయినా నీవు అల్లా మాట్లాడితే మాయమయి, మళ్లీ ప్రత్యక్షమౌతూ రాకు. అల్లా హఠాత్తు హఠాత్తుగా మారితే తల దిమ్మెత్తుతోంది" అంది పాప.

"అల్లాగే లే" అంటూ పిల్లి మళ్ళీ మాయ మవటం మొదలుపెట్టింది. ఈమాటు తోకదగ్గరనుంచీ మాయమవాటం మొదలుపెట్టింది. పిల్లి అంతా మాయ

మయ్యాకకూడా, ఆ ఇకిలింపుమాత్రం కాసేపు అల్లాగే మిగిలి చివరికి మాయమయింది.

"ఇకిలింపు లేని పిల్లులను చూశాను గాని, పిల్లి కూడా లేని ఇకిలింపు ఎక్కడా చూడలేదే ! ఇది మరీ గమ్మత్తుగా ఉంది" అనుకొంది పాప.

పాప అల్లా కొంతదూరం నడిచేటప్పటికి తొట్టికుందేలు" ఇల్లు కనబడింది. అది తొట్టికుందేలు ఇల్లే అనేందుకు దృష్టాంతంగా, రెండు పొగగొట్టాలు అచ్చుకుందేలు చెవుల్లాగా ఇంటిపైకి నిక్క పొడుచుకొని ఉన్నాయి. ఇంటి పైకప్పు అంతా పాకలాగా; పైన బొచ్చుతో అల్లినట్టుగా ఉంది. ఇల్లు చాలా ఎత్తుగా పెద్దదిగా కనబడేటప్పటికి 'ఇంత చిన్న పిల్లనుగా వెళ్లటం బాగుండ' దని ఎడమచేతిలో మిగిలిఉన్న ముక్క కొంత నమిలి, రెండడుగుల ఎత్తు మనిషి అయ్యేదాకా ఆగింది.

అప్పటికి కూడా పాపకు లోపలికి వెళ్లటానికి భయం భయంగానే ఉంది. అల్లాగే పిరికితనంతో ఇంటి వైపుకు కదులుతూంది.

ఓవేళ, మరీ, పిచ్చెత్తిపోయి ఉండదుగదా. తీరా ఇటు వచ్చేశానే; వెఱ్ఱివెంగళాయిని చూడటానికని వెళ్లినా బాగుండేది !"

# 12

ఆ ఇంటిముందు తోటలో, చెట్టుక్రింద పెద్ద టేబిలు చుట్టూ, టీ పార్టీకిలాగా కుర్చీలూ అవీ అమర్చి ఉన్నాయి. బల్ల కోమూలగా, వెఱ్ఱివెంగళాయి, తొఱ్ఱ కుందేలు, క్రిక్కిరిసి కూర్చున్నట్టుగా కూర్చున్నారు. వాళ్ల మధ్యగా వెల్ల ఎలుక నిద్రపోతోంది. తొఱ్ఱకుందేలూ, వెఱ్ఱివెంగళాయీ యిద్దరూకూడా, ఎలుక వీపుమీద తమ మోచేతులానించి దాని తలకు సరిగ్గా పైగా తమ మొహాలుపెట్టుకొని మాట్లాడుకొంటున్నారు.

"అల్లా యిద్దరూ ఆనుకుంటే ఆ ఎలుకకు ఎంత ఉక్కిరిబిక్కిరిగా ఉంటుందో! అయినా నిద్రపోతోందిగా; అందుకని పర్వాలేదేమో?" అనుకొంటూ పాప బల్లదగ్గిరకు వచ్చింది.

పాపను చూడగానే ఆ యిద్దరూ ఒక్కసారి "ఇక్కడ ఖాళీలేదు, ఇక్కడ ఖాళీలేదు" అంటూ అరిచారు.

పాప కోపంగా "ఖాళీలేకేం? కావలసినంత ఉంది." అంటూ వాళ్ళమాటలు తోసేస్తూ బల్లచివర నున్న ఒకపెద్దచేతుల కుర్చీలో కూలబడింది.

కుందేలు పాపకు కాస్త హుషారిస్తున్నట్లుగా, "కాస్త ద్రాక్షరసం పుచ్చుకో" అంది.

పాప బల్ల అంతా కలయచూసింది "ద్రాక్ష రసం ఎక్కడా నాకు కనబడటంలేదే ?" అంది.

"అసలు ద్రాక్షరసమే లేదులే" అంది కుందేలు.

"లేని వస్తువు పుచ్చుకోమని అడగటం ఏమిటా మర్యాద ?" అని పాప కోపంతో అడిగింది.

"పిలవకుండా వచ్చి కూర్చోటం ఏం మర్యాదో ?" అంది కుందేలు.

"ఇది నీ బల్ల అని వ్రాసిపెట్టిఉందా ? ఇక్కడ ముగ్గురికంటే ఇంకా చాలామందికి జాగాఉంటే, నీ బల్లేఅని ఎల్లా అనుకొనేది ?" అంది పాప.

వెంగళాయి అంతవరకూ ఏమీ మాట్లాడలేదు. పాప వచ్చినప్పటినుంచీ పాపవంక విక్రృతంగా, ఎగాదిగా పరకాయించి చూస్తూన్నాడు. పాపతో "నీజుట్టు ఇంకొంచెం కత్తిరింపించాలి" అన్నాడు.

"ఒకళ్ల సొంత విషయాలు ఇంకోళ్లు మాట్లాడకూడదు. అది చాలా మోటుతనంగా ఉంటుంది" అని పాప తీవ్రంగాఅంది.

ఈ మాట వినేటప్పటికి వెంగళప్ప అత్యాశ్చర్యంగా కొత్తవిషయం విన్నట్టు, కళ్లు పత్తికాయలంతంత చేశాడు. కాని ఆ విషయమే ఎత్తకుండా, "ఆస్తే, ఊస్తే, ఉస్తికాయ, దస్తాబల్ల ఎల్లా అవుతుంది ?" అని అడిగాడు.

"పిల్లేదో పొడుపుకథలు మొదలుపెట్టారు. కాస్త బాగానేఉంది" అని సంతోషంగా అనుకొంటూ పాప—

"బహుశా ఆ కథ నే విప్పగలనేమో అనుకొంటాను" అని గట్టిగాఅంది.

"దానికి జవాబు నువ్వు తెలుసుకోగలననేనా నువ్వనుకొనేది ?" అని కుందేలు అడిగింది.

"ఔనౌను ; అంతే, అంతే" అంది పాప.

"అయితే అనుకొనే దేదో అదే అనరాదూ?" అని కుందేలు గదమాయించింది.

పాప త్రొందరగా — "అనుకొన్నదే అంటున్నాను. అన్నదే అనుకొంటున్నాను. రెండూ ఒకటేగా" అంది.

"రెండూ ఒకటి ఎప్పటికీ కావు. ఆ లెక్కను– 'నే తినేదల్లా చూస్తాను, అన్నా, 'చూసేదల్లా తింటాను' అన్నా ఒకటే అవొచ్చు—" అన్నాడు వెంగళప్ప.

"నాకు కావలసిందల్లా తెచ్చుకొంటాను' అన్నా, 'నాకు తెచ్చుకొన్నదల్లా కావాలి' అన్నా ఒకటే అవచ్చు గాబోలు" అని కుందేలు అందుకొంది.

వెల్లఎలుక "'నేను నిద్రపోతూన్నప్పుడల్లా ఊపిరి పీలుస్తాను' అన్నా, 'ఊపిరి పీలుస్తూన్నప్పుడల్లా

నిద్రపోతాను' అన్నా ఒకటిగాబోలు!" అంటూ నిద్రలో మాట్లాడుతున్నట్లుగా అంది.

"నీ విషయంలో రెండూ ఒక్కటే" అన్నాడు వెంగళాయి.

మళ్ళీ కాసేపు ఎవళ్ళూ మాట్లాడకుండా కూర్చున్నారు. ఆస్తే అంటే ఏమిటో, ఊస్తే అంటే ఏమిటో—అని పొడుపుకథవిషయం పాప ఆలోచిస్తూ కూర్చుంది. కాని ఎంతసేపటికీ ఏమిటో అర్థమే తట్ట లేదు.

మళ్ళీ వెంగళాయే మాట్లాడటం మొదలు పెట్టాడు. పాపవంక తిరిగి "ఇవాళ తారీఖెంత?" అని అడిగి, జేబులోంచి ఒక జేబుగడియారం తీసి దానివంక చూస్తూ మాటిమాటికి చెవికిదగ్గిర పెట్టుకొని, గడి యారం గట్టిగా కదుపుతూ, మళ్లీ చూస్తూ, గడియా రాన్ని కదుపుతూన్నాడు.

పాప కాసేపు ఆలోచించి, "ఏడో తారీఖు" అంది.

"అప్పుడే రెండు రోజులు తప్పింది" అని వెంగ ళాయి ఒక నిట్టూర్పు విడిచాడు. మళ్ళీ కోపంతో కుందేలువంక తిరిగి, "వెన్నతో గడియారం బాగు చేయకూడదని నీతో చెప్పలా?" అని కోప్పడ్డాడు.

"మంచి వెన్నే మరి" అని కుందేలు, నసు గుతూ సమాధానం చెప్పింది.

"మంచిదైతేమటుకు, ఆ చాకుతో పట్టించా వాయెను; చాకుకు అంటుకుని, రొట్టెతునకలు అవీ ఉండిఉంటాయాయెను." అంటూ వెంగళాయి, మొగం మాడ్చుగా అన్నాడు.

కుందేలు గడియారాన్ని తీసుకొని దానివంక మొహం చిట్లిస్తూ చూస్తూ, టీకప్పులో ముంచింది. "మంచి వెన్నే నే—సికూ్మడా తెలుసుగా?" అంటూ ఇందాకటి మాటే మళ్లీ సాగించింది.

పాప కుందేలుబుజాలమీదుగా వంగి గడియా రంవంకే చూడటం మొదలెట్టింది:

"బలే గమ్మత్తు గడియారమనే! నెలలో తారీ ఖెంతో చూపిస్తూంది గాని, ఇప్పుడు గంట ఎంత యిందో చెప్పదేం?"

"ఎందుకు చెప్పాలి? ఇదేం సంవత్సరమో నీ గడియారాలుమాత్రం చెప్తాయా?"

"ఎందుకు చెప్తాయ్? ఎప్పటికీ చెప్పవు. సంవ త్సరమంటే ఎంతకాలందాకానో ఒకటిగానే ఉంటుందా మెను" అని పాప వెంటనే జవాబు చెప్పింది.

"నా గడియారంవిషయమూ అంతే" అన్నాడు వెంగళాయి.

వెంగళాయి మాట్లాడింది తెలుగే అయినా పాపకు ఏమీ అర్థమయినట్టే అనిపించలేదు. అతి మర్యాదగా "నాకు సరిగ్గా అర్థంకాలేదు" అంది.

"వెల్ల ఎలుక అప్పుడే నిద్రపోయినట్లుంది" అంటూ వెంగళాయి ఎలుకముక్కుమీద 'టీ' పొయ్యటం మొదలుపెట్టాడు.

ఎలుక హడావిడిగా తల విదిలించుకొంటూ కళ్లు తెరవకుండానే, "వినాను, నిజం; నిజం, నేనూ అదే చెబ్దామనుకొంటున్నాను" అంది.

"కట్టుకథ ఇప్పటికైనా విప్పావా?" అంటూ వెంగళాయి పాపను అడిగాడు.

"లేదు. నాకు తెలియటంలేదు. ఏమిటో చెప్పు" అంటూ పాప అడిగింది.

"నాకు తెలియనే తెలియదు" అన్నాడు వెంగళాయ్.

"నాకూ అంతే" అంది కుందేలు. పాప విసుగుతో ఒక నిట్టూర్పు విడిచింది. "ఇల్లా తెలియని ప్రశ్నలతో కాలం వృధా చెయడంకన్నా దాన్నింతకన్నా బాగా వినియోగించుకోటం నయం" అంది.

"నీకు 'కాలంతో' నా కున్న పరిచయమే ఉండిఉంటే 'దాన్ని,' 'అది' అనవు. 'వాడు' అనాలి. కాలం పురుషుడు."

"నువ్వనేదేమిటో నా కర్థం కాలేదు" అంది పాప.

"అర్థం కాదులే! అవటం ఎందుకూ? నువ్వు కాలాన్నెరుగనే ఎరుగవు" అన్నాడు వెంగళాయ్.

పాప విసుగుగా "వెధవకాలం ఎమిటీ వెఱ్ఱి గొడవ; పోదూ—" అంది.

"అదుగో అందుకే నీకు కాలంఅంటే పడదు — కాస్త మంచిమాట చేసికొంటే, కాలం మనకు కావలసినట్లు అల్లా మారుతుంది. పాఠాలు చదువుకొనేవేళ ఏడుగంటలుఅయింది అనుకో; కాలం చెవిలో కాస్త ఊదితేసరి, ఒక్క-క్షణంలో గడియారం గిఱ్ఱున తిరిగి పదకొండుగంట లైపోతుంది. ఇట్టే భోజనాలవేళ అవుతుంది" అన్నాడు వెఁగళాయి.

"ఇప్పుడయితే బాగుండును" అంది కుందేలు.

పాప ఆలోచించినట్లుగా కాస్త ఆగి "అయితే బాగుండును నిజమే, ననుకో. మరి ఆకలి ఎల్లా అవుతుంది ?" అని అడిగింది.

"ఆకలి అయేదాకా అల్లా భోజనాల వేళగానే ఉంటుందిగా."

"ఇక్క-డ అల్లా చేస్తారన్నమాట" అని అడిగింది పాప.

వెఁగళాయి విచారంగా తలతిప్పి — "ఊహూ ! నే నల్లా చెయ్యను-కిందటిసారి, కాలమూ నేనూ దెబ్బలాడుకొన్నాంగా. అప్పుడే వాడికి పిచ్చిఎత్తేముందు, అప్పుడు రాణీగారు పాట పాడమంటే నే పాడాను. రాణీగారిక్కి కోపంవచ్చింది. 'రాగానికి తాళానికి కాలం కుదరకుండా చంపేస్తున్నాడు; వీడి తల కొట్టెయ్యండి ! అని ఆజ్ఞ ఇచ్చింది."

"అయ్యో! అంత అఘాయిత్యమా ?" అంది పాప.

"అప్పటినుంచీ అస్తమానం టీ తాగే కాలం గానే నిలిచిపోయింది. కప్పులూ అవీ మళ్లీ కడుక్కో-నేందుకుకూడా మధ్యకాలం మిగులలేదు.

"అందుకనా - టేబిలునిండా ఇన్ని టీకప్పులున్నాయి ?" అని తెలిసివచ్చినట్టుగా అంది పాప. "మరి అయితే, టేబిల్ చుట్టూ తిరుగుతూ ఒక్కొ-క్క-కప్పుదగ్గి రే కూర్చుంటూ ఉంటారన్నమాట."

"అచ్చంగా అంతే."

"మరీ - " పాప మళ్లీ ఏదో అడగబోయింది.

"ఎంతసేపూ ఒక విషయమేనా మాట్లాడటం ? కబుర్లు మార్చాలి. కొత్తఅమ్మాయి కథ చెప్పాలని నేను ప్రతిపాదిస్తూన్నాను" అంటూ కుందేలు విషయం తప్పించింది.

పాప హఠాత్తుగా ఆమాట విని కంగారుగా - "నాకేం కథలు రావు" అంది.

"అయితే, ఎలుక చెప్పాల్సిఉంటుంది."

అంటూ ఇద్దరూ ఎలుకను రెండువైపులా గట్టిగా గిల్లటం మొదలుపెట్టారు.

ఎలుక నెమ్మదిగా కళ్ళుతెరుస్తూ "అబ్బే, నేను నిద్రపోవటంలేదు. ఇందాకటినుంచీ మీరు చెప్పే వన్నీ వింటూనేఉన్నాను" అని, ఆవలించింది.

"మాకొక కథచెప్పు" అంది కుందేలు. పాప

కూడా చెప్పు అని అడిగింది. "త్వరగా మొదలెట్టు. లేకపోతే, మళ్ళీ అల్లా ఆవలిస్తూ నిద్రపోతావు" అంటూ వెంగళప్ప ఎలుకని గట్టిగా గిల్లాడు.

"అనగా అనగా ముగ్గురు అక్కచెల్లెళ్ళుండే వారు -" అంటూ ఎలుక తొందర తొందరగా కథ మొదలుపెట్టింది.

"ఎక్కడ?" అని పాప అడిగింది.

"ఒక నూతి అడుగున బతుకుతూఉండేవారు."

"నూతి అడుగున ఎల్లా బ్రతికేవారు? ఏం తినే వారు?"

"తారు తిని బ్రతికేవాళ్ళు" అంది ఎలుక.

"తారు తింటే జబ్బుచెయ్యదూ?" అని అడిగింది పాప.

"ఆ! వాళ్ళ ముగ్గురికీ జబ్బు చేసింది."

"నూతి అడుగున తారు ఎక్కడిది?" -

కుందేలు పాపవంక తిరిగి "ఇంకొంచెం ఎక్కువగా టీ తాగు" అని బుజ్జగిస్తున్నట్టుగా అంది.

"అసలు నే నింతవరకూ టీయే తీసికోందే" అంది పాప చిరుకోపంతో.

"అసలే తీసికోకపోతే, అంతకన్నా తక్కువ తీసుకోటానికి వీల్లేదుగాని, ఇంకొంచెం ఎక్కువగా తీసికోటానికేం?" అన్నాడు వెంగళాయి.

"తమర్ని చెప్పమని ఎవళ్ళా అడగలే" దంది పాప.

"ఒకళ్ళ నొకళ్లు అంటూ మొదలెట్టింది, ఇప్పుడు ఎవరో!" అంటూ వెంగళాయి సగర్వంగా ఇకిలించాడు.

"అది తారునుయ్యి." అంటూ ఎలుక మళ్ళీ మొదలుపెట్టింది.

"తారునుయ్యి ఎక్కడుంటుంది?" అంది పాప కోపంతో.

కుందేలూ, వెంగళాయీకూడా పాపను "హుష్" అని గదమాయించారు.

"మర్యాదగా కథ వినలేవా? వినకపోతే, తక్కినకథ నువ్వే చెప్పు" అంటూ ఎలుక చిట్లుమంది.

పాప బతిమాలుతూ "లేదు లే, లేదు లే; మాట్లాడనుగా. చెప్పు, చెప్పు. ఎక్కడన్నా ఒకటి అల్లాంటి దుండేదేమోలే!"

ఎలుక కోపంతో అరిచింది:

"ఒకటా? లక్ష ఉంటేనూ" అని మళ్ళీ ఎల్లాగో కథ చెప్పటం మొదలుపెట్టింది.

"వాళ్లు ఆ నూతిలో ఉంటూ, గీతలు, గీస్తూ అన్నీ గీసేవాళ్లు. కోపం, నవ్వు, ఏడుపూ, నొప్పి— అన్నీ గీతల్లో గీసేవాళ్లు. కోపం ఎల్లా గీతల్లో గీస్తారో మరి నీకు తెలుసా?"—

"నాకు తెలియదు" అంది పాప.

"మరి ఏమీ తెలియనిదానివి నోరుమూసుకు కూర్చోలేవూ" అన్నాడు వెంగళాయి.

అంత మోటుగా అల్లా అనేటప్పటికి పాపకు కోపంవచ్చి, అక్కడనుంచి ఛఖ్ఖున లేచిపోయింది.

కాని, లోపల వాళ్లు తనను బ్రతిమాలి వెనక్కి పిలవాలనేవుంది. అల్లా పిలుస్తారేమో నని ఒక సారి వెనక్కి చూసింది. కాని వాళ్ళు పిలవలేదు. చాలామార్లు వెనక్కి చూసింది. చివరిసారి చూసే టప్పటికి వాళ్లిద్దరూ ఎలుకను పట్టుకొని, టీ కాచే పాయిలో తలక్రిందులుగా ముంచుతున్నారు.

“ఏమిటీ పిచ్చిగొడవ; తెలివితక్కువ కబుర్లానూ? వీళ్లతో కూర్చునేదేమిటి?” అంటూ ముందుకు సాగింది. ముందుగా మళ్లీ ఒక చెట్టు కనబడింది. ఆ చెట్టుకు ఒక తలుపుఉంది. “బలే గమ్మత్తుగా ఉందే!” అనుకొంటూ పాప తలుపు తోసుకొని లోపలకు నడిచింది.

మళ్లీ ఇందాకటి హాలులో గాజుమేజాబల్లదగ్గర కొచ్చింది. ఈమాటు బంగారపు తాళంచెవి తీసుకొని, గౌనుజేబులో పెట్టుకొన్న కుక్కగొడుగుముక్క కొరికి, అడుగు ఎత్తుకు వచ్చాక, ఆ క్రింది చిన్న తలుపు తీసుకొని తోటలోకి వెళ్లింది.

## 13

తోటనిండా రంగు రంగుల కాయలూ, పువ్వులూ కాసున్న చెట్లూ, మొక్కలూ, చల్లదన మిస్తూ

నీళ్ల తుంపురులు వెదజల్లుతూన్న నీటి బుగ్గలూ, అన్నీ చక్కగా ఉన్నాయి.

తోట ప్రవేశిస్తూండగా మొదట్లోనే ఒక తెల్ల గులాబీచెట్టు ఉంది. ఆ చెట్టుకు దగ్గరగా ముగ్గురు తోట మాలులు, కుంచెలు, ఎఱ్ఱరంగుడబ్బాలూ పుచ్చుకొని, తెల్లగులాబీపువ్వులన్నిటికీ ఎఱ్ఱరంగు పూస్తున్నారు. పాపకు గమ్మత్తుగా తోచి వాళ్ళకు కొంచెం దగ్గరగా వెళ్ళింది. వాళ్ళల్లో వాళ్లు మాట్లాడుకొంటూన్న మాటలు పాపకు వినబడుతున్నాయి.

"ఒరేయి, ఐదుగా, కాస్త చూసి రంగు వెయ్యలేవ్రా ? నా వంటినిండా రంగు చిలకరిస్తున్నావు."

ఐదుగాడు మొహంమాడ్చుగా, "నే నేం చేసేది? ఈ ఏడుగాడు నా మోచేయి తోసేశాడు."

ఏడుగాడు మొహం ఎత్తి, "అదేరా బాబూ, ఆ దే! అన్నిటికీ తప్పులన్నీ ఇంకోళ్ళ నెత్తిని తోయ్యటమేగా నీపని" అన్నాడు.

"నోరు ముయ్యవోయి, నిన్న రాణిగారు నీతల కొట్టేయమంటోంటే నే విన్నాలే" అన్నాడు ఐదుగాడు.

"తల ఎందుకు కొట్టెయ్యమంది ?" అంటూ మొదటివాడు అడిగాడు.

"ఒరేయి ! రెండుగా ! నీకదంతా అనవసరం; ఊర్కో" అని ఏడుగాడు ఉరిమాడు.

"అనవసర మేమిటి? అనవసరం ఏం కాదు. వాడికి అవసరమే. నేచెప్తా వినరా! నిన్న వంటలక్క ఉల్లికోళ్లు తెమ్మంటే, ఏడు తుంగవేళ్లు తీసుకెళ్ళాడు" అంటూ ఐదుగాడు జవాబు చెప్పాడు.

ఏడుగాడు కోపంతో కుంచె, డబ్బా కూడా నేల కేసి కొట్టి అరుస్తూ "ఇల్లాంటి అవక తవక వాగుడు వాగితేనే—"అంటూ ఏదో అనబోయి, చటుక్కున పాపను చూసి ఆపేశాడు. తక్కిన ఇద్దరూకూడా, వాడు మాట ఆపేటప్పటికి, తల ఎత్తి పాపవంక చూసి, నిర్ఘాంతపోయినట్టుగా ఏడుగాడితో కూడా కలిసి పాపకు సలాంచేస్తూ ముందుకు వంగారు.

పాప భయం భయంగానే, అతినెమ్మదిగా, "ఈ గులాబిపూవులకు ఎఱ్ఱరంగు ఎందుకు వేస్తున్నారో కాస్త చెబుతారా ?" అని అడిగింది.

ఏడుగాడు, ఐదుగాడు మాట్లాడకుండా రెండు గాడివైపు చూశారు. రెండుగాడు నెమ్మదిగా సన్న కంఠంలో చెప్పటం మొదలు పెట్టాడు:

"అసలు సంగతేమిటంటేనండీ, ఇక్కడ అసలు ఎఱ్ఱగులాబీచెట్టు పాతి ఉండవలసిఉందండీ ! మేము పొరపాటున ఇక్కడ తెల్లగులాబీచెట్టువేశాము. ఈ సంగతి రాణీగారికి తెలిస్తే, వెంటనే మాతలకాయ కొట్టేస్తుందిగా. అందుచేత ఆమె ఇల్లా వచ్చేలోపలే, ఈ గులాబీపువ్వు లన్నిటికీ ఎఱ్ఱరంగువేస్తున్నాం."

అంతవరకూ తోటగుమ్మంకేసి ఆదుర్దాగా చూస్తున్న ఐదుగాడు అడావిడిగా—"రాణిగార్రోయ్! రాణిగారు!" అంటూ ఒక్కకేక వేశాడు. గబాలున ముగ్గురుతోటమాలులూ బోర్లగిలకుప్పలుగా నేలమీద పడుకొన్నారు. వాళ్ళ వీపులన్నీ ఒకమాదిరిగా నలుచదరపు పేకముక్కల్లాగా వెనుక ఒకేమాదిరి అల్లికగీతలతో ఉన్నాయి. తలా, కాళ్ళూ, చేతులూ అన్నీ కూడా తాబేలులాగా ఆ వీపుక్రిందికి ఇముడ్చుకొన్నారు. ఇందాకటినుంచీ చూస్తున్నప్పుడు కూడా పాపకు విచిత్రంగానే అనిపించింది. వాళ్లు వట్టి పేకముక్కలకు తలా చేతులూ కాళ్ళూ అతికించినట్లున్నారు. ముగ్గురికీ వీపులు ఒకే పేకముక్కల కున్నట్లుగా ఒకమాదిరిగానే ఉన్నాయి. ముందు వైపున, ఒకడికి ఇస్పేటు రెండుముక్కలు, మరొకడికి ఐదు ఇస్పేటుముక్కలు, మూడోవాడికి ఏడు ఇస్పేటు ముక్కలూ ఉన్నాయి.

వాళ్లు అల్లాగే కదలకుండా మెదలకుండా పడి ఉన్నారు. ఇంతలో తోటగేటు తోసుకొంటూ పది మంది సైనికులు, కళావరు ముక్కల్లాంటి గదలు ధరించి వస్తున్నారు. వాళ్ళు కూడా ఆముక్కల మార్పుతప్ప తక్కిన రూపమంతా ఇందాకటి తోటమాలుల లాగే ఉన్నారు. పేకముక్కలలాగా రూపం, మూలల చేతులూ కాళ్లూ, పైన తలా, అతికించినట్లుండటం - అల్లాగే ఉన్నారు. ఇద్దరిద్దరు జంటగా

నడుస్తూ సైన్యాల వరుసలో వస్తున్నారు. వాళ్ల వెనుక పదిమంది రాజసభాసదులు వస్తున్నారు. వాళ్లకు వజ్రాలలాగా మెరుస్తూ డైమను ముక్కలున్నాయి. వాళ్లు సైనికులలాగే ఉత్సవంలో వస్తున్నట్లు ఇద్దరు ఇద్దరు బారుగా నడుస్తూవస్తున్నారు. వాళ్ల తర్వాత రాజుగారిపిల్లలు పదిమంది ఎగురుతూ, గంతులేసు కొంటూ చెట్టాపట్టాలు పట్టుకొని వస్తున్నారు. వాళ్లం దరికీ "అరకు" ముక్కలు నేసిఉన్నాయి. వాళ్ల తర్వాత సామంతరాజులూ, రాణులూఅంతా ఊరేగిం పులో వస్తున్నారు. వాళ్ల మధ్య తెల్లకుందేలు వస్తూండటం పాప చూసింది. కాని తెల్లకుందేలు, ఎవ రితోటో మొఖప్రీతిమాటలు చెప్తూతూ, ఓహ్హోహ్హో అని వాళ్లమాటకు దొంగనవ్వు నవ్వుతూ, పాపవంక చూడనన్నా చూడకుండా నడిచిపోయింది. ఆ తర్వాత ఊరేగింపులో, అరకు జాకీ వచ్చాడు. రాజుగారి కిరీ టాన్ని ఎఱ్ఱని ముక్మల్ పట్టు రుమాలులో భద్రంగా పట్టుకొని నడుస్తున్నాడు. అందరికన్నా వెనుకగా వస్తూ, అరకురాణి, రాజుగారలూ, కివిగా నడస్తూ వస్తున్నారు.

తోటమాలులు ముగ్గురూ సాగిలబడ్డట్టుగా తానుకూడా నేలమీద బోర్లబొక్కలుగా పడుకో వాలా అని పాప ఒక క్షణం ఆలోచించింది. రాజు గారు వస్తూంటే అల్లాంటి ఆచారం ఉందని పాప ఏ కథలోనూ ఎక్కడా చదవలేదు.

"అయినా బోర్లబొక్కలుగా పడుకుంటే ఊరే గింపు చూడటమెల్లా? ఎవళ్లూ చూడనికాడికి ఊరే గింపు చేసుకోవటం ఎందుకూ?" అంటూ పాపఉన్న చోట అల్లాగే కదలకుండా నిలిచింది.

రాజుగారి పరివారం పాపదగ్గరకు వచ్చి రాగానే, పాపను చూస్తూ అంతా ఆగి నిలచారు.

రాణీగారు తీవ్రంగా చూస్తూ, అరకు జాకీవంక తిరిగి -

"ఇది ఎవరూ?" అని అడిగారు. అరకుజాకీ నోరు మెదపకుండా, సలాంమాత్రం చేస్తూ, "ఇహీహీ" అని ముఖప్రీతి నవ్వు నవ్వాడు.

"ఓరి శుద్ధమొద్దువెధవా!" అంటూ రాణీ గారు తల ఎగరేసి, పాపవంక తిరిగి -

"నీపేరేమిటి పిల్లా?" అని అడిగింది.

"చిత్తమండి మహారాణీగారు, నా పేరు పాప అండీ" - అంటూ సలాంచేస్తూ పాప అతిమర్యాదగా అంది. తనలో మాత్రం "అరే! వీళ్లంతా వట్టి పేక ముక్కలేనే. వీళ్లకి నేనింత భయపడటం ఎందుకూ?" అనుకొంది.

"మరి వీళ్లెవళ్లూ?" అంటూ రాణీగారు కింద సాగిలబడ్డ తోటమాలులను ముగ్గుర్నీ చూపించి అడిగింది. మరి వాళ్ల వీపులూ, అక్కడున్న వాళ్లందరి వీపులూ ఒకేమాదిరిగా ఉండబట్టీ, వాళ్లు రాజ పుత్రులో, సైనికులో, లేక తోటమాలులో రాణీగా

రికి తెలియలేదామెను. అక్కడున్న వాళ్లంతా ఒక పేకలో ముక్కలలాగే వీపులమీద కలంకారీ అంతా ఒకేమాదిరిగా ఉన్నారు.

"నాకేం తెలుసు? నాకిదే పనా ఏమిటి?" అని పాప గట్టిగా అంది. అని తనల్లా అన్నందుకు తన ధైర్యానికి తానే ఆశ్చర్యపోయింది.

రాణీగారి మొగం కందగడ్డలా ఎఱ్ఱబడిపోయింది. పాపవంక నిప్పులు కక్కుతూ చూస్తూ, చెయ్యివిసిరి, "దీని తల కొట్టెయ్యండి, కొట్టేయండి!" అంటూ అరిచింది.

"ఛాత్" అంటూ పాపకూడా గట్టిగా, స్థైర్యంగా అరిచింది. రాణీగారు నోరెత్తలేదు.

రాజుగారు రాణిని బుజ్జగిస్తున్నట్టుగా, "పాపం పసిపిల్లలే! ఏం తెలుస్తుంది? ఊరో్కు, ఊరో్కు" అని రాణీని బతిమాలాడు.

రాణీ కోపంతో రాజువైపునుంచి మొహం త్రిప్పేసి, "వాళ్లను తిరగెయ్యి" అంటూ అరకుజాకీకి ఆజ్ఞ ఇచ్చింది.

అరకుజాకీ అతిజాగ్రత్తగా, కాలు కదుపుతూ కొసగోట వాళ్లను తిరగేస్తున్నాడు.

ఇంకా "నిలబడరేం!" అంటూ రాణీ మళ్లీ ఉరిమింది.

తోటమాలులు ముగ్గురూ ఒక్క ఎగురెగిరి నిలబడి, రాణీగారికి, రాజుగారికి, అక్కడున్నవాళ్లంద

రికీ అదేపనిగా వంగివంగి సలాములు చెయ్యటం మొదలుపెట్టారు.

ఇక ఆపండి! ఇక ఆపండి. తలతిరిగిపోతూంది" అంటూ అని, రాణీ గులాబిచెట్టువంక చూస్తూ, వాళ్లను "ఏం చేస్తున్నా రిక్కడ ? ఆ!" అని గదమా యించింది.

రెండుగాడు మొదలెట్టాడు. "చిత్తమండీ, మహారాణీగారు, మహారాణీగారు, సలాంఅండీ, మేమండీ-మేము-" అంటూ నీళ్లు నములుతున్నాడు.

రాణీ ఈలోపల గులాబీ పూలను చూసింది. చూసి "అదా సంగతి! తెలిసిందిలే! వీళ్ళ తల కొట్టె య్యండిరా!" అని ఆజ్ఞ ఇచ్చి పరివారసమేతంగా ముందుకు కదిలిపోయింది. ముగ్గురు సైనికులుమాత్రమే తోటమాలుల తలకాయలు కొట్టేసేందుకు మిగిలారు.

సైనికులు పట్టుకోటానికొస్తూంటే, తోట మాలులు తప్పించుకొని పరుగెత్తి, పాప వెనక్కి చేరి, "రక్షించాలి! రక్షించాలి" అంటూ పాపగౌను పట్టుకు వేళ్లాడటం మొదలుపెట్టారు.

"మీకేం భయంలేదు; మీ తలకాయి ఎవళ్లూ కొట్టేయకుండా చూస్తాగా." అంటూ పాప వాళ్లని ముగ్గురినీ అక్కడఉన్న ఒక పెద్ద పూల మొక్కల కుండులో దాచింది. సైనికులు వాళ్లకోసం రెండుమూడు నిమిషాలు అటూ ఇటూ వెదకి, రాణీ గారి పరివారంతో కలుసుకొనేందుకు పరుగెత్తారు.

"వాళ్ల తలకాయలు కొట్టేశారా?" అంటూ రాణి కేక పెట్టింది.

"చిత్తం. మహారాణీగారు, తమ దయవుండి, వాళ్ల తలకాయలు ఎగిరిపోయాయండి" అంటూ ముగ్గురు సైనికులూ కేక వేశారు.

"అబ్బా! నీకు పచ్చీస్ఆట వచ్చునా?" అని మళ్ళీ కేక వేసింది.

ఈమాట పాప నడుగుతోందని సైనికులు ముగ్గురూ మాట్లాడకుండా పాపవంక చూశారు.

"ఆ! వచ్చును" అంటూ పాప గట్టిగా కేక వేసింది.

"అయితే ఇల్లా రా!" అంటూ రాణి గావుకేక పెడ్తూ అరిచింది.

"ఏం జరుగుతుందో, తమాషా చూద్దాం" అనుకొంటూ కులాసాగా పాప, వాళ్ల మందలో కలుసుకొని నడవసాగింది.

## 14

"ఇక్కడ చాలా బాగుంది కాదూ?" అంటూ సన్నగొంతుకతో ఎవర్లో పాపపక్కనే పలుకరించారు. పాప, పక్కకు చూసేటప్పటికి, తెల్లకుందేలు పక్కనే నడుస్తూ పాపముఖంలోకి అతి వినయంగా చూస్తూ, అతి భయభక్తులతో నెమ్మదిగా పాప నడుగుతూంది.

"చాలా బాగా నేడుంది. అయితే జమీందారిణి ఏదీ ?" అని పాప అడిగింది.

తెల్లకుందేలు ఆదావుడిగా నోటిమీద వేలు వేసుకొంటూ, అతి నెమ్మదిగా, "ఉష్ ఉష్" అంటూ పాపతో ఆ మాట ఎత్తవద్దన్నట్టు తెలిపింది. అని, వెనక్కి ఇటూ అటూ మెడత్రిప్పి ఎవళ్లూ లేరుకదా అన్నట్టు చూసి, మునివేళ్లమీద నిలబడి, పాప చెవి దగ్గరగా నోరుపెట్టి, రహస్యంగా, "జమీందారిణి తల కొట్టేయమని ఆజ్ఞ అయింది" అని చెవిలో చెప్పింది.

"ఎందుకనీ ?" అని పాప అడిగింది.

"ఎందుకు పాపం, అనా అంటున్నావు ?" అంది కుందేలు.

"నేనేం అల్లా అనలే; పాపం ఏముంది, పాపమేం లేదు. ఊర్కే ఎందుకని అడిగాను, అంతే."

"రాణిగారిని లెంపకాయకొట్టింది." అంటూ కుందేలు మొదలుపెట్టింది.

పాపకు సంతోషం ఆగక, పకపకా నవ్వింది. కుందేలు భయంతో పాప చెవిలో "ఉష్ ! నవ్వకు ! రాణీగారు వింటుంది. అసలు ఏమైందంటే - జమీందారిణి ఆలస్యంగా వచ్చిందిగా మరి. అందుకని రాణీగారు అన్నది..." అంటూ చెప్తూంది.

"ఎవళ్ల జాగాల్లో వాళ్లు నిల్చోండి" అంటూ రాణి ఉరుములాంటి కేక వెయ్యటంతో, అంతా కంగా

రుగా ఒకళ్ళనొకళ్లు తోసుకొంటూ ఒకళ్లమీద ఒకళ్లు పడుతూ లేస్తూ జాగాల్లో నిల్చోటానికి పోతూన్నారు.

అసలు అల్లాంటి పచ్చీసుఆట పాప మును పెక్కడా చూడలేదు. చాలామంది వరుసలు వరుసలుగా కాళ్లుచేతులు నేలమీద ఆనుకొనివంగుతూ, పచ్చీసుగళ్లుగా తయారయారు. డైమను చుక్కలున్న పిల్లలు పచ్చీసు పావుల్లాగా మెదటి పంటగడిలో కూర్చున్నారు. ఇందాకటి తోటమాలుల్లాగా, ఇస్పేటుచుక్కలున్నవాళ్లు మరి ఏడుగురు ఒకచోట నిలబడ్డారు. కళావరుచుక్కలున్న సైనికులు ఇద్దరిద్దరొక్కొక్కణ్ణి పట్టుకొని గాలిలో తిప్పుతూంటే కళావరుజాకీ ఒక గద పుచ్చుకొని, వాళ్లను గాలిలోకి పైకి విసురుగా ఎగురగొట్టున్నాడు. వాళ్లు క్రిందపడ్డాక ఎల్లా పడ్డవాళ్లు అల్లాగే పడిఉండలి. రాణీ ఒక్కొక్కడి దగ్గిరికీ వచ్చి "ఉల్టా", "సీదా" అంటూ లెఖ్ఖ పెట్టుతూ, చివరికి ఏదో అంకె కేకవేసేది. పంటగడిలో ఉన్న ఒక డైమనుచుక్కకుఱ్ఱాడిని నల్గురూ పట్టుకొని కూర్చున్నవాణ్ణి అల్లాగే మోసుకెళ్లి ఎన్ని అంకెలు చెప్పిందో అన్ని గళ్లూ దాటాక గడిలో దభీమని కూలబడేసేవాళ్లు. మధ్య మధ్య రాణి "పావు" చచ్చింది; తల కొట్టేయ్" అని కేకేసేది. ఆ డైమను చుక్క కుఱ్ఱాడు ఏడుస్తూంటే నల్గురు కాళ్లూ చేతులూ బట్టుకొని బడబడా బైటికి లాక్కుపోతూండేవాళ్లు. ఇస్పేటు చుక్కలవాళ్ల వీపులు, రొమ్ములు పగిలేటట్టు

అల్లాగే ఎగరేస్తూ ఆట సాగిస్తూన్నారు. రాణీ ఊర్కే కేకలేస్తూ అరుస్తూ, కోపం వచ్చినచోటల్లా తల కొట్టేయమని ఉరుముతూ అంతటా కలయ తిరుగుతూంది

పాపకు ఆటఅంతా వికృతంగానే తోచింది. "రాణీ కోపంతో, చివరి కిక్కడున్నవాళ్ళూ మిగిలేట్లే తోచదు. అందరితలలూ కొట్టెయ్యమంటుంది. ఎల్లాగో ఈ ఆటలోంచి తప్పించుకొని బైటపడితే బాగుండును" అనుకొంటూ, ఎవళ్లూ చూడకుండా ఇవతలికి రావటం ఎల్లాగా అని పాప ఆలోచించటం మొదలుపెట్టింది.

అటూఇటూ చూస్తుంటే పాపకు ఆకాశంలో ఏదో గమ్మత్తురూపం ఒకటి కనబడింది. ఏమిటా అని పరకాయించి చూసేటప్పటికి, ఇందాకటి దేవర పిల్లి నవ్వు – "పోనీలే, పిల్లైనా కనబడితే కాస్సేపు కబుర్లాడుకోవచ్చు" అనుకొంది పాప.

"ఆట ఎల్లాఉంది?" అని పిల్లినోరు అడిగింది. (అంటే, అప్పటికి అంతమాత్రమే కనబడుతోంది.)

కళ్లు కనబడేదాకా ఆగి పాప తల ఊచింది. "చెవులుకూడా రాందే, మాట్లాడితే ఏంలాభం; వినబడుతుందా ఏమైనానా" అని ఊరుకుంది. ఒక్క నిముషానికి పిల్లి ముక్కూ, చెవులూ, తలా, అంతా కనబడింది.

"ఇక్కడ ఓ న్యాయంగా ఆడటమూ, పాడూ ఏమీ లేనట్లుంది" అంటూ పాప మొదలుపెట్టింది. "అదీ కాకుండా, బ్రతికున్న పావులూ బ్రతికున్న గవ్వలూనూ; వాట్లను ఇష్టమొచ్చినట్లు చావగొట్టు న్నారు. ప్రతీవాళ్ళూ తగాదాలే - అందరి తలలూ కొట్టేయటమే-అందరికన్నా రాణీయే మరీ అన్యాయం ఆట ఆడుతూంది - "

"రాణీ ఎల్లాంటి దంటావు? నీకేమైనా నచ్చిందా?" అని పిల్లి అడిగింది.

"ఊహూ!" అని పాప దీర్ఘంతీసి - "రాణీ..." అని ఏదో చెప్పబోయేటప్పటికి తన వెనకగానే రాణీ నిల్చున్నట్లుచూసి మాట తిప్పేస్తూ -

"రాణీగారు అందరికంటే చాలా బాగా ఆడు తోంది. తప్పకుండా ఆవిడే నెగ్గుతుంది. తక్కినవా ళ్లాడటం దండగే" అంది.

రాణీ పాపవంక చూసి స్నేహంగా, చిరునవ్వు నవ్వి మళ్లీ తన ఆటలోకి వెళ్లిపోయింది.

రాజు పాపప్రక్కకు వచ్చి నుల్చుని - "ఎవరి తోటి - మాట్లాడుతున్నావు?" అని అడిగాడు.

"దేవరపిల్లితోటి - దేవరపిల్లికీ నాకూ సావా సము — నీకుకూడా సావాసం కలపనా?" అని అడి గింది పాప.

"అదేమిటి? మరీ అల్లా చూస్తుంది - నాకేం

బొవృళ్లేదు. పోనీలే, కావాలంటే నా చెయ్యి ముద్దెట్టు కోమను -"

"ఛాత్ ! నేనేం ముద్దెట్టుకోను" అంది పిల్లి.

"ఏమిటా ధిక్కారము! అసలు అల్లా చూడొద్దని చెప్పలా" అని పిల్లితో అంటూ రాజు, పాప వెనక్కు నక్కాడు.

"చూస్తే ఏమయిందేమిటీ? పిల్లిమాత్రం రాజుగార్ని చూడకూడదా ?" అంటూ పాప సద్దటం మొదలుపెట్టింది.

"ఏమైనా ముందు ఆ పిల్లి నిక్కడినించి తీసెయ్యాలి" అన్నాడు రాజు. అప్పుడే రాణీ ఆ ప్రక్క నుంచి వెళుతూంటే, "ప్రియా! ఈ పిల్లి నిక్కడ నుంచి తీయించెయ్యవూ?" అని బ్రతిమాలాడు. రాణీ ఇటు తిరిగన్నా చూడకుండానే, "తల తీసెయ్" అని ఒక్కగావుకేక పెట్టి తనదోవను తను మళ్లీ ఆటలోకి పరుగెత్తుకుపోయింది.

"తలకొట్టేసేందుకు తలారిగాడిని నేనే పిలుచుకొస్తాను" అంటూ రాజు తొందరతొందరగా అక్కడి నుంచి కదిలిపోయాడు.

కాసేపు ఆట చూద్దామని పాప కదిలింది. రాణీగారు అప్పుడే ముగ్గురి నల్గురి తలకాయలు కొట్టేయమని ఆజ్ఞ ఇచ్చేసింది. అక్కడినుంచి కదిలి అటూఇటూ తిరిగి పాప మళ్లీ పిల్లిని చూద్దామని వెనక్కి వచ్చేటప్పటికి, అక్కడ పిల్లితల చూస్తూ ఒక

గుంపు చేరారు. రాణీ రాజు, తలారిమాత్రం ఏదో బిగ్గరగా వాదించుకొంటున్నారు. తక్కినవాళ్లంతా నిశ్శబ్దంగా వింటున్నారు.

పాప కనబడేటప్పటికి ముగ్గురూ పాపచుట్టూ చేరి గందరగోళంగా మాట్లాడుతూ తగవు తీర్చమంటూ ఎవళ్లమాట వాళ్లు పాపతో చెప్పటం మొదలుపెట్టారు. అందరూ ఒక్కసారి మాట్లాడటంతో పాప కసలు సంగతేమిటో అర్థం కాలేదు.

తలారి పిల్లితల చూపించి, "దేహం లేనిదే తలను దేన్నుంచి కొట్టేయటం?" అంటాడు.

"తల అన్నదున్నాక కొట్టేయడాని కేం?" అంటాడు రాజు.

"ఏదో ఒకటి రెండు క్షణాల్లో చెయ్యక పోయారా, ఇక్కడందరి తలకాయలు కొట్టేయిస్తా" నంటుంది రాణీ.

పాప కేమి చెప్పడానికీ తోచలేదు.

"అసలా పిల్లి జమీందారిణిది. ఆవిడను పిలుచుకొస్తే ఏం చెయ్యాల్సిందీ చెప్తుంది" అంది పాప.

"జమీందారిణి, తలకొట్టేయిద్దామని జైలులో పెట్టి ఉంచాంగా. ఒరే తలారీ- పోయి జైలులోంచి జమీందారిణీని తీసుకురా" అని రాణి ఆజ్ఞ యిచ్చింది. తలారి తూణీగలాగ పరుగెత్తి పోయాడు. రాణీ మళ్లీ ఆటలోకి పరుగెత్తింది.

తలారి జమీందారిణి చెయ్యి పట్టుకొని వగుస్తూకొంటూ పరుగెత్తుకొచ్చాడు. వాళ్లిద్దరూ వచ్చేటప్పటికి పిల్లితల మళ్లీ మాయమయిపోయింది. పిలితలకోసం వెదకుతూ రాజూ, తలారీ కలసి అడా విడిగా నాల్గుమూలలకూ పరుగెత్తటం మొదలు పెట్టారు.

# 15

జమీందారిణీ, పాపా మాత్రమే అక్కడ మిగిలారు.

"అమ్మాయ్, నిన్ను మళ్ళీ చూసేటప్పటికి నాకెంత సంతోషంగా ఉందని చెప్పనూ!" అంటూ జమీందారిణి ఆప్యాయంగా పాప చేతులో చెయ్యి కలుపుతూ నడవటం మొదలు పెట్టింది.

జమీందారిణి ఇంత హుషారుగా, నవ్వుతూ పల్కరించినందుకు, పాపకు కూడా సంతోషమే వేసింది. అసలు ఇందాక ఆవిడ అంత కోపం తాపం తోటి కారాలూ - మిరియాలూ నూరుతూ కనబడటానికి, ఆవంట యింటి పోపులో ఉన్న కారాలూ మిరియాలే కారణంగాబోలని పాప అనుకొంది.

"నేనే జమీందారిణీ నయితే,"—తాను జమీందారిణీ ఎప్పటికీ కాలేనని ఓమూల చప్పరించుకొంటూనే పాప తనలో అనుకోటం మొదలు పెట్టింది:

"నేనే జమీందారిణీ నయితే వంటయింట్లోకి కారాలు మిరియాలు అసలే రానీయను. కారాలు – మిరియాల వల్లనే మనుష్యులకు కోప తాపాలు ఎక్కువవుతాయి. చింతపండు, వక్కాయలూ, ఇల్లాంటి పులుపులు తింటేనే, పుల్ల మొహాలతో చిడుముడులాడుతూ తయారవుతారు. చేదు కాకరకాయలూ (అబ్బ వెధవ కాకరకాయకూర) అవీ తినబట్టే, విషపుచ్చులతో తయారవుతారు. చక్కగా పంచదార నేతి మిఠాయీ తింటే తియ్యగా ఉందురు. అందుకనే పిల్లలెప్పుడూ తియ్యగా మాట్లాడుతూ కమ్మగా ముద్దొస్తూ ఉంటారు. పెద్దవాళ్ళకి ఈమాత్రం తెలియదేం? తెలిస్తే పిల్లల కింకా ఎంత ఎక్కువగా మిఠాయిలు, చాకలేటులు— అన్నీ..."

అల్లా వరుసగా ఆలోచించుకొంటూ జమీందారిణి మాటే మరిచిపోయింది పాప. అక్కడదాకా వచ్చేటప్పటికి, జమీందారిణీమాట చెవిలో విన బడింది. "ఏయ్ అమ్మాయి, ఏమిటో ఆలోచిస్తున్నావు కాదూ ? అందుచేత ఏమీ పలక్కుండా ఉన్నావు. నాకిప్పుడు జ్ఞాపకం లేదుగాని దీని కేదో నీతి ఉండి ఉంటుంది"

"ఆలోచిస్తూ పలక్కపోటానికి నీతి ఏమిటి? ఏముంటుంది?" అంది పాప.

"ఆ! అల్లా అనకు; ప్రతిదానికీ ఏదో ఒక నీతి ఉండి ఉంటుంది. మనం కాస్త ఆలోచించి తెలుసుకో

వాలే గాని తప్పకుండా ఉంటుంది" - అంటూ జమీం దారిణి మరీ ఆప్యాయంగా పాపమొహంలోకి మొహం పెట్టా మరీ కౌగలించుకొంటూ దగ్గరకు జరిగింది.

పాపకు మరీ ఉత్కృష్టంగా ఉంది. అసలే జమీందారిణిమొహం చాలా అసహ్యంగా ఉంది. పైపెచ్చు, సరిగ్గా పాప చెవులదాకా వచ్చే ఎత్తున ఉందేమో, జమీందారిణి సన్నపాటి నిడుపు గడ్డం పాపబుజానికి ఆనించి మరీ గుచ్చుకునేటట్టుగా నొక్కుతూంది. పాప కాస్త తప్పించుకొందా మను కొంది గాని, ఏమైనా కదిలి నడకమారిస్తే మరీ మోటుగా ఉంటుందేమో నని, అల్లా ఉత్కృష్టంగానే నడుస్తూ ఉంది. అయినా మాట్లాడకపోయినా మోటు గానే ఉంటుందేమో నని, "ఇప్పుడు రాణీగారి ఆట కొంచెం బాగా సాగుతున్నట్లు ఉందే" అంది.

"ఆ. సాగుతూనే ఉంది. దానిసీతి ఏమిటో తెలుసా? తినగా తినగా వేము తియ్యబడుతుంది; తియ్యగా తియ్యగా రాగం చక్కబడుతుంది. అనే" అంది జమీందారిణి.

"అబ్బ! ప్రతిదానికీ ఏదో సామెతా, నీతీ చెప్తాందేమిటి ఈవిడ? నీతులంటే పడి చచ్చేట్టుంది" అనుకొంది పాప.

జమీందారిణి ప్రతిమాటకూ అల్లా ఏదో సామెతో, నీతో కల్పించి చెపుతూనే ఉంది.

పాప మళ్ళీ ఏదో ఆలోచనలో పడింది.

"ఏమిటో? మళ్ళీ ఆలోచిస్తున్నావు" అంటూ జమీాందారిణీ గడ్డం మరీ గట్టిగా పాపబుజంమీాద నొక్కింది.

పాపకు అప్పటికే చిరాకు వేసు కొస్తూంది.

"ఆలోచించుకొనేందుకు నాకు హక్కు లేదా?" అని పాప కాస్త చిరాకుగా అడిగింది.

"పందులు ఎగరటానికీ పాప ఆలోచించటానికీ హక్కేమిటి? దానినే..."

అంతవరకు వచ్చి తన 'నీతికి' సగంలోనే జమీాందారిణి నోరు కట్టడిపోయి, వళ్ళంతా వొణికి పోవడం మొదలు పెట్టింది.

పాప తల వంచుకు నడుస్తూం దేమో, జమీాం దారిణి హఠాత్తుగా ఇల్లా అయిందెందుకో తెలియక తలయెత్తి చూసింది.

ఎదురుగుండా రాణీ ఒళ్ళంతా బిగుసుకుపోయే టంత కోపంతో ఉరుముతూన్న పిడుగులాగా, కళ్ళు చింతనిప్పులు చేసుకొని జమీాందారిణివంక చూస్తూంది.

"ఇదిగో నీకు ఆఖరిసారి చెప్తున్నాను. ఇక్కడ నుంచి నీ తలకాయైనా ఎగిరి పోవాలి, లేదా నువ్వైనా ఎగిరిపోవాలి ఎల్లా చేసుకొంటావో. అర నిమిషం టైమిచ్చాను" అని రాణీ ఉరిమింది.

జమీందారిణి, పాపను విడిచి ఒక్క పరుగులో అక్కడినుంచి మాయమై పోయింది.

"దా! ఆట కానిద్దాం" అంటూ రాణి పాపను వెంటబెట్టుకొని చదరంగంఆటదగ్గరకు వెళ్ళింది.

రాణీ కాస్త ఇవతలికి వచ్చేటప్పటికి, ఆటలో వాళ్లంతా చెట్లకిందికి చేరి కాస్త ఆయాసం తీర్చుకొంటున్నారు. రాణీని చూసేటప్పటికి అకస్మాత్తుగా పరుగెత్తుకొంటూ, గబగబా వంగి నిలిచేవాళ్లు గళ్ళ స్థానాలలోనూ. గన్నలూ, పావులూ, ఎవళ్ల స్థానాలలో వాళ్లు కంగారు కంగారుగా నిలబడ్డారు. పాపకు రాణీని చూస్తే భయంగానే ఉందిగాని తప్పుకు పోటానికి దోవ కనబడటం లేదు.

ఆట మళ్లీ సాగింది. అరగంట అయేటప్పటికి ఆటలో ఉన్నవాళ్లందరినీ ఒకళ్ల నొకళ్లనే "తల కొట్టేయ్!" అంటూ ఆజ్ఞయిచ్చి, అవతల కూర్చో పెట్టింది.

చివరికి "తల కొట్టెయ్య" మనకుండా ఆటలో మిగిలినవాళ్లు, రాణీ, రాజు - పాపా, ముగ్గురు మాత్రమే. అందుచేత ఆటకూడా ఆఖరయి పోయింది.

రాణీ ఆట ఆడిన ఆయాసంతో వగర్చుకొంటూ "మాయ తాబేలు, నెప్పుడన్నా చూశావా?" అని పాపవంక తిరిగి అడిగింది.

"చూడలేదు - అసలు మాయతాబే లేమిటో నాకు తెలియదు" అంది పాప.

"అయితే దా, నాతో దా; చూపిస్తాను. నక్కా-గుంటనక్కా, కొక్కూ - పందికొక్కూ, అనం? అల్లాగే తాబేలూ - మాయతాబేలూ ఉంటాయి. దాని కథంతా అదే చెప్తుంది. విందాం, పద; చాలా బాగుంటుంది" అని రాణి పాపను లాక్కుపోయింది.

రాణీ, పాప, ఇవతలికి కదలి రాగానే, రాజు నెమ్మదిగా "సరే, మిమ్మల్నందరినీ క్షమించేశాను; పొండి," అని అంటూండటం పాపకు వినబడింది. రాణీ ఆ ధోరణి పట్టించుకొన్నట్లుగా పాపకు కనబడలేదు. "బహుశా రాణి ఆ మాట విన్నట్లు లేదు" అనుకొంటూ పాప రాణితోటి నడవసాగింది.

పోతూండగా దోవలో వాళ్లకొక వింత జంతువు తోక, కాళ్లూ, గిట్టలూ, అన్నీ మామూలుజంతువులాగానే ఉన్నాయి. కానీ పక్షిలాగా పెద్ద గద్ద ముక్కూ, రాంబందు రెక్కల్లాగా రెక్కలూ కూడా ఉన్నాయి.

"ఏమ్, రావణాబందూ! ఓసీ సోమరిపీనుగా లే! లే!" అంటూ రాణీ ఆ జంతువును నిద్రలేపింది.

"రాంబందు ఉన్నట్లుగానే రావణాబందు కూడా ఉందే" అనుకొంది పాప.

"ఇదిగో! ఈపిల్లను మాయతాబేలు దగ్గిరకు తీసుకుపో! మాయతాబేలు కథ వింటూందట - నాకు పని ఉంది పోవాలి. తలకాయలన్నీ సరిగ్గా కొట్టే

శారో, లేదో చూడాలి." అంటూ పాపను రావణా
బందుదగ్గర వదిలి రాణీ వెనక్కి తిరిగిపోయింది.

'రావణాబందును'ను చూస్తే పాపకు ముందు భయమే వేసింది. కాని "తల కొట్టేసే" రాక్షసి రాణితో వెళ్ళటం కంటే, ఈ జంతువుతో ఉండటమే, నయం అనిపించింది.

"రావణాబందు" లేచి కూర్చుని కళ్లు నులుముకొని ఆవులించింది. తర్వాత రాణీ వెనక్కి వెళ్తూన్న దిక్కే చూస్తూ, మళ్లీ ఆవులించి "భలే తమాషాయే" అంది.

పాప తెల్లబోయి "తమాషా ఏముంది ?" అని అడిగింది.

"తమాషా కాదూ—ఈ రాణీ అన్నీ అనుకోటం, అంటం తప్ప ఏమీ జరగనే జరగవు. అంతా రాణీ భ్రమ. ఎందుకూ, ఇక్కడ ఎవళ్ళతలా ఎప్పుడూ కొట్టేయనే లేదు. సరేలే. నడు పోదాం" అని పాపకు ఆజ్ఞ ఇస్తూ కదిలింది.

"అబ్బ ! ఇక్కడ అందరూ ఏమిటో ఊ. 'ఆజ్ఞలివ్వటమే—ఇంతగా నా జన్మలో ఎప్పుడూ ఎవళ్ళూ నన్ను ఆజ్ఞాపించనే లేదు—ఛా !" అనుకొంటూనే పాప రావణాబందు వెంటనే బయలుదేరింది.

కాస్త దూరం నడిచేటప్పటికే, మాయతాబేలు దూరాన ఒక రాతిగుట్టమీద కూర్చుని ఉస్సురుస్సు

రని నిట్టూరుస్తూ కళ్లనీళ్లతో వెక్కిలు పెడుతూ కూర్చుంది.

మాయతాబేలు అంతా తాబేలులాగే ఉందిగాని, తల, చెవులూ, వెనకకాళ్లూ, కాళ్లగిట్టలూ తోకా, ఆవుదూడవిలాగా ఉన్నాయి. వీపుమీది బొరుసుల చిప్పా, ముందరి పాదాలూ, మాత్రం అచ్చు తాబేటివిలాగానే ఉన్నాయి. ఆ నిట్టూర్పులూ, శోకనాదాలూ, దూరానికే, పాపకు వినబడ్డాయి.

"అల్లా విచారంగా ఉంది; ఏం కష్టమొచ్చిందా ఏమిటి?" అని పాప రావణాబందు నడిగింది.

"అదంతా దాని 'భ్రమే' అంతకంటే ఏమీ లేదు. తను ఎప్పుడూ ఏదో కష్టాల్లో ఉన్నానని భ్రమ పడుతుంది" అంది రావణాబందు. "ఇందాకా రాణీ దంతా భ్రమ అంది. ఇప్పుడీ తాబేలుదంతా భ్రమ అంది—అందరికీ భ్రమ గాబోలు" అనుకొంది పాప.

మాయతాబేలుదగ్గరకు రాగానే "రావణా బందు" పాపను మాయతాబేలుకు చూపిస్తూ, "ఈవిడగారికి నీ కథ వినాలని ఉందిట-చెప్పు" అంది.

"చెప్తాను కూర్చోండి" - అంటూ ఏడుపు గొట్టు కంఠంతో ముక్కు చీదుకొంటున్నట్టుగా అంది మాయతాబేలు. "ఇద్దరూ కూర్చోండి - కథ పూర్తి అయేదాకా ఎవళ్లూ ఏమీ మాట్లాడకూడదు."

# 16

పాప మాట్లాడకుండా కూర్చుంది. వాళ్లు ఇద్దరూ కూడా మాట్లాడకుండానే కూర్చున్నారు. మాయతాబేలు ఎంతసేపటికీ నోరు తెరవనూ లేదు; కథ మొదలుపెట్టనూ లేదు.

"అసలు మొదలెట్టటమే ఎంత సేపటికీ అవక పోతే ఇక కథ పూర్తి అవటం ఎల్లా అవుతుందో?" అని పాప తనలో తను అనుకొంది.

చివరికి ఎల్లాగో ఓ గంటసేపటికి మాయతాబేలు తనకథ చెప్తున్నట్టు మొదలుపెట్టి గట్టిగా ఒక నిట్టూర్పు విడిచి కళ్లుతుడుచుకొని "ఒకప్పుడు నేను కూడా అసలు తాబేలుగానే ఉండేదాన్ని" అని మళ్లీ చాలాసేపు నిశ్శబ్దంగా కూర్చుంది.

రావణాబందు ఉండి ఉండి మధ్య మధ్య "హెక్ ఓక్" అంటూ గొంతులో గుంగుర అంటున్నట్టు, ఎక్కిళ్లు నదులుతూ మాట్లాడకుండా కూర్చుంది. మాయతాబేలు నిట్టూర్పు విడుస్తూ ఉండటం, ఎక్కిళ్లు దిగమింగుతూండటం, అదే పనిగా తీరుబడిగా చేస్తూ అల్లాగే పలక్కుండా కూర్చుంది.

పాపకు లేచిపోదామా అనిపించింది. "కథ చాలా బాగుందండి. చాలా సంతోషమయింది. సరే ఇక వెళ్లివస్తాను" అని చెప్పేసి లేచి వెళ్లిపోతే

బాగుంటుంది అని అనుకోటం మొదలుపెట్టింది. "కాని అసలు ఇంకా ఏదో కథ అంటూ ఉండి ఉండాలి కదా, ఎల్లాగూ చెప్పి తీరుతుంది. పోనీ వినే కదులుదాము" అని మళ్లీ అనుకొంటూ కదలకుండా బాసింపట్టు వేసుకొని అల్లాగే కూర్చుంది.

చివరికి మాయతాబేలు తన్ను తాను సముదాయించుకొని (మధ్య మధ్య అక్కడక్కడ ఎక్కిళ్లు పెడుతూనే) నెమ్మదిగా కథ చెప్పటం సాగించింది.

"మా చిన్నప్పుడు సముద్రంలో బడికి పాఠాలు నేర్చుకొనేందుకు వెళ్లాము. మాతో పంతులు ఉండే వాడు. ఆయన తాబేలేగాని, ఆయన్ను 'పాఠీనం' అని అనేవాళ్లం.

"తాబేలును 'పాఠీనం' అని ఎందు కనే వాళ్లు?" అని అడిగింది పాప.

"మాకు పాఠాలు చెప్పేవాడిని 'పాఠీనం' అనమూ? నువ్వెక్కడో తెలివితక్కువ మొద్దులా గున్నావే!" అని మాయతాబేలు కోపంతో అంది.

"అల్లాంటి చొప్పదంటు ప్రశ్నలు అడగటానికి సిగ్గు లేదూ?" అని రావణాబందు గదమాయించింది. కానే పిద్దగూ పాపవంక అతినికృష్టంగా చూసినట్లు చూడటం మొదలుపెట్టారు. వాళ్లు అలా చూస్తోంటే పాపకు సిగ్గుతో భూమిలో కుంగిపోదామా అనిపించింది. చివరికి రావణాబందు మాయతాబేలు వంక తిరిగి, "కానియ్యవోయ్, కథ కానియ్.

ఇక్కడే పొద్దు గుంకేటట్లు ఉంది'' అంది. తాబేలు మళ్లీ కథ మొదలుపెట్టింది.

''సరే, మేము అక్కడ సముద్రంలో బడికి వెళ్లేవాళ్లం - నువ్వు నమ్మకపోతే మానె'' అని మళ్లీ పాపవంక చూసింది.

''నేనేం నమ్మటం లేదని ఏమీ అనలే'' దంది పాప.

''అన్నావు'' అంది తాబేలు.

పాప ఏదో జవాబు చెప్పబోతోంటే రావణా బందు, ''నోర్మూయ్, మాట్లాడక!'' అని పాపను గదమాయించింది. తాబేలు కథ సాగించింది.

''అక్కడ మాకు ఎక్కడా చెప్పనంత చక్కగా చదువు చెప్పేవారు. మేము రోజూ బడికి వెళ్లేవాళ్లము''

''నేనూ రోజూ బడికి వెళ్తాను. పెద్ద ఏదో గొప్పగా చెప్పుకుంటున్నావు గాని.''

''మీ బడిలో అన్నీ చెప్తారూ—పై పాఠాలు కూడా?'' అని అడిగింది తాబేలు.

''ఆఁ, అన్నీ చెప్తారు—కుట్టుపనీ, అల్లికపనీ'' అంది పాప.

''కడగటం, తోమటం, ఉదకటం, నేర్పుతారూ?''

''ఛీ! ఛీ! అల్లాంటి దానీపనులేం నేర్పరు—'' అని పాప ఛీకొట్టింది.

"ఆ! అదీ! అవి నేర్చుకపోతే ఏం బడి, నా మొహం బడి! మేం చదువుకొన్న బడి అంటే ఒకటో రకం బడి. అక్కడ మాకు..." అని తాబేలు ఇంకా ఏదో అంటూంది.

"అయినా నీకు సముద్రం అడుగున ఉండే దానికి, కడగటం అవీ నేర్చుకోటం ఎందుకు?" అని పాప అడిగింది.

తాబేలు నిట్టూర్చి, "అదే! కర్మ. నేను నేర్చుకోలేదు. పైపాఠాల క్లాసులకు వెళ్లిక మామూలు పాఠాల క్లాసులకే వెళ్లేదాన్ని."

"మామూలు పాఠా లేమిటి?"

"ఏడవటం, రాగటం, ఎక్కులూ, ఇంకా సముద్రగోళం—"

"సముద్రగోళం ఏమిటీ, భూగోళం కాదూ?" అని అడిగింది పాప.

తాబేలు కోపంతో, "నాల్గుపాళ్లు సముద్రం ఒకపాలు భూమీ ఉంటే, సముద్రగోళం అనక, భూగోళం అంటారు మరీ వళ్లు పొగరుగాని!" అని అంది.

పాప కిమ్మనకుండ ఊర్కొంది.

"ఇంకా, ఆశ, అత్యాశ, దురాశ, పరాశ" అన్నీ నేర్పేవారు" అంటోంది తాబేలు.

"'పరాశ' ఏమిటీ?" అని అడిగింది పాప.

"పరాశ తెలియదూ? పరాశరుడు అని విన్నావా?" అని అడిగింది రావణాబందు.

"ఏంటే, దానికీ దీనికీ సంబంధమేమిటి?" అని అడిగింది పాప.

"పరాశరుడి గుణమే, పరాశ" అంది రావణాబందు.

"ఎక్కడో శుద్ధ మొద్దు స్వరూపంలా ఉన్నావే" అంది తాబేలు.

పాపకు మరీ చిరాకు ఎత్తుకువచ్చినట్లయింది. అయినా వాళ్లిద్దరిమధ్యనుంచీ బయటపడటంకూడ ఎల్లాగో తెలియటంలేదు. తాబేలు మళ్లీ తన కథ చెప్తోంది.

"ఇంకో పంతులు, ఈదటం బాదటం, చేదటం, అన్నీ నేర్పేవాడు. డ్రిల్లుమాస్టరుండేవాడు. ఉండ చుట్టుకుపోవటం - బండగా పడటం - నార సాగిపోవటం అన్నీ చెప్పేవాడు"

"నారసాగిపోవటం ఎల్లా?" అని అడిగింది పాప.

"ఇప్పుడు నాకు ఒళ్లు నొప్పులుగా ఉంది. రావణాబందూ, నువ్వు చూపించు" అంది తాబేలు.

"ప్చ్! ఆ క్లాసు ఎగేసి పారిపోయేదాన్ని నేను; నాకు రాదు" అంది రావణాబందు.

"రోజూ ఎన్ని గంటలు చదివేవాళ్లేమిటి?" అని అడిగింది పాప.

"మొదటిరోజు పదిగంటలు. రెండోరోజు తొమ్మిదీ. అల్లా రోజూ రోజూ ఒకగంట తగ్గించే వాళ్లు."

"అయితే పదకొండోరోజు ఆటవిడుపన్న మాట." అంది పాప.

"అవును, ఆటవిడుపే."

"మరి అయితే పన్నెండోరోజున ఎల్లా?" అంది పాప.

రావణాబందు తాబేలుతో "సరే, ఆ గొడవ ఆపుదూ. ఒప్పులకుప్ప ఆడుదాం" అంటూ తాబేలు చేతులు పట్టుకొని, ఇద్దరూ పాపచుట్టూ గంతులేయటం మొదలుపెట్టారు. మధ్యమధ్య పాపకాళ్లు తొక్కుతూ పాపచుట్టూ గిరగిరా తిరుగుతున్నారు. ఎంతసేపూ, "ఒప్పుల కుప్పా – ఒప్పుల తిప్పా, తిప్పల కుప్పా, కొప్పుల తిప్పా - ఒప్పుల కుప్పా" అంటూ తారు మారుగా ఒకటే అంటూ రొదగా పాడుతూ తిరుగు తున్నారు. "ఒప్పులకుప్పా" తర్వాత "ఒయ్యారి భామా" రావాలని పాప ఎంత చెప్పినా ఎవళ్లూ విని పించుకోలేదు.

అల్లా తిరుగుతూ తిరుగుతూ గబుక్కున పాప చేయికూడా పట్టుకొని గిరిలోకి లాగుతూ ముగ్గుర్నీ తిప్పుతూ గిరగిరా తిరగటం మొదలుపెట్టారు. పాపకు ఆయాసంవచ్చి, "వీళ్లెప్పుడు వదులుతార్రా భగవం తుడా!" అనుకోటం మొదలుపెట్టింది.

చివరికి ముగ్గురూ కళ్ళుతిరిగి ఆయాసంవచ్చి చేతులుపట్టు వదలి కూలబడ్డారు. రావణాబందు పాప వంక తిరిగి, "నీకు పాటలువచ్చునా?" అని అడిగింది.

పాప ఆయాసంతో మాట్లాడలేక, అయినా మళ్ళీ పాడితే ఏంతిప్పలొస్తాయో అనుకొంటూ ఊరొక్కుంది.

"వచ్చా?" అని తాబేలూ అడిగింది.

"మునుపు వచ్చుకాని, ఇందాక పట్టుపురుగు ముందు పాడబోతే పద్యంఅంతా తప్పేవచ్చింది." అంది.

ఆ మాటతో పాపకథ చెప్పమని వాళ్ళిద్దరూ పాపచుట్టూ మూగారు. పాప తనకథ చెప్తూంటే ఆశ్చర్యంతో మిడిగుడ్లేసుకొని వింటున్నట్టు విన్నారు.

కాసేపుండి తాబేలు రావణాబందుతోటి, పాప రావణాబందుశిష్యురాలయినట్టు, రావణాబందు పాప మీద పూర్తి అజమాయిషీ ఉన్న పంతులయినట్టూ - "ఇప్పుడేదన్నా అప్పచెప్పమని చూడు" అని పాపా విషయం రావణాబందుతో అంది.

పాప ఏదో అప్పచెప్పబోయింది కాని ఏమీ జ్ఞాపకమే రాలేదు. రావణాబందు పాప కందిద్దామని పాట మొదలుపెట్టి, అందించటంకోసమే అన్నమాటే మరిచిపోయినట్లుగా పాటఅంతా చివరిదాకా తనే పాడేస్తూ గంతులెయ్యటం మొదలుపెట్టింది. తాబేలు కూడా చప్పట్లు చరుస్తూ, రావణాబందుతో కోలాటం

నడకలు నడుస్తూ చేతులూ చేతులూ కలిపి, చప్పట్లు చరుచుకొంటూ, 'హారిలో రంగా హారి' అంటూ, రావణాబందను కలుపుకొని పాపచుట్టూ గిరగిరా తిరగటం మొదలుపెట్టింది.

ఇంతలో "విచారణ ప్రారంభం అవుతోందో హోమ్" అంటూ పెద్ద సాటింపుకేకలాగా కేక వినబడింది.

వీళ్లు ఇద్దరూ చటుక్కన ఆగి నిలచారు.

పాప "ఏం విచారణ?" అని అడిగింది.

రావణాబందు ఏమీ జవాబు చెప్పకుండా పాప చెయ్యి పట్టుకొని "పదపద, ముందు పద" అంటూ పరుగెడ్తూ పాపను వెంట లాక్కునిపోయింది.

# 17

పాప రాజసభలోకి వెళ్లేటప్పటికే అరకురాణీ, రాజూ, సింహాసనాలమీద కూర్చునిఉన్నారు. సభనిండా అనేకరకాల చిన్నపక్షులూ, జంతువులూ అన్నిరకాల రంగులతో ఠీవిగా కూర్చుని ఉన్నాయి. జాకీగాడి కాళ్లకు సంకెళ్లు తగిలించి బోనులో నిలబెట్టారు. ఇద్దరు సిపాయిలు వాడికి చెరొకవైపు నిలబడి పహారా ఇస్తున్నారు. తెల్లకుందేలు, దండనాథుడిలాగా రాజుగారి ప్రక్కన వంగి నిలబడి నమ్రతతో ఒక కాగితం పుచ్చుకొని ఇచ్చకపునవ్వులు నవ్వుతూ

రాజుగారితో గుసగుసలాడుతూన్నంత నెమ్మదిగా ఏదో చెబుతూంది. సభలో మధ్యగా ఒక బల్లమీద ఒక పళ్ళెమూ పళ్ళెంలో మూడు కజ్జికాయలూ ఉన్నాయి. పాపకు వటిని చూసేటప్పటికి నోరు ఊరింది.

"విచారణేదో త్వరగా ముగించేసి ఆ కజ్జికాయలు మనకు పంచిపెడ్తే బాగుండును'' అనుకొంది పాప. కాని ఎక్కడా ఆ కోర్కె తీరేటట్లు కనబడ లేదు. అందుకని ఆ కోర్కె చంపుకొని కాస్త కాల క్షేపంగా ఉండటానికని, పాప సభఅంతటా కలయ చూడటం మొదలుపెట్టింది.

పాప న్యాయసభనూ, న్యాయస్థానమనూ ఎల్లాఉంటుందో ఏంజరుగుతుందో, ఎప్పుడూ చూడ లేదు. ఏవో చూచాయగా వాళ్ళవాళ్ళ మాటలూ, పాఠాల్లో ఎవళ్లో చదువుతూన్నప్పుడు వినటమూతప్ప, అసలు నిజాని కెల్లాఉంటుందో తెలియదు. కాని అల్లా మాటలూ అవీ వినిఉండేమో, అక్కడి విషయాలన్నీ చూస్తూంటేనే ఎవళ్లనీ అడక్కుండానే తెలిసినట్ట యింది పాపకు.

"ఆ బుట్టతలపాగా, పట్టుకుచ్చుల కోటూ, ఆ బుఱ్ఱమీసాలూ, అతనే జడ్జీ అయిఉండాలి, ఆ, అంతే'' అనుకొంది పాప జడ్జీని చూసి.

"వాళ్లు పన్నెండుగురు పంచాయతీదార్లు అను కొంది పక్కను చూసి. అక్కడ ఒక తొట్టిలాంటి

దాంట్లో పన్నెండు జంతువులు, పలకలూ బలపాలూ, పుచ్చుకుని పంచాయితీ వ్రాసుకోటానికి తయారైనట్లు, మెడలు సాచి నిక్కించి ముద్దాయివంక చూస్తూ కూర్చున్నారు. సంకెళ్లున్న 'జాకీ' గాడు ముద్దాయి అని పాప ఇట్టే గ్రహించింది. "ముద్దాయి, పంచాయితీదార్లు" అని ఆ మాటలు మళ్లీమళ్లీ తనలో అనుకోటం మొదలుపెట్టింది. అసలు ఆమాటలు తనకు తప్ప తనయీడు పిల్లలకెవళ్ళకూ తెలియవని పాప గర్వం.

పంచాయితీదార్లు పలకలమీద బలపాలతో బఱబఱా ఏదో రాయటం మొదలుపెట్టారు.

"ఎవళ్ల పేర్లు వాళ్లు ముందు వ్రాసుకొంటున్నారు. ఎందుకంటే, తీరా విచారణ పూర్తి అయే లోపల, తమ పేర్లు తామే మర్చిపోతామేమోనని వాళ్ళభయం" అంటూ రాజహంస పాప చెవిలో అంది.

పాప కోపంతో "వట్టి తెలివితక్కువ మొద్దులు" - అని ఇంకేదో అనబోతోంది.

తెల్లకుందేలు గట్టిగా "కామోష్! సభలో నిశ్శబ్దంగా ఉండాలి" అని కేక వేసింది. రాజుగారు మాట్లాడేదెవరో చూడటానికని కళ్లజోడు పెట్టుకున్నాడు.

పాప కంగారుగా మాట ఆపుకొని నిశ్శబ్దంగా నిల్చుంది.

పంచాయితీదారులు పలకలమీద వ్రాస్తున్నదంతా పాపకు కనబడుతూంది. ప్రతి పంచాయితీదారూ "వట్టి తెలివితక్కువ మొద్దులు" అని వ్రాసుకొంటున్నారు. అందులో ఒకడికి 'మొద్దులు' వర్ణక్రమం తెలియక పక్కవాడిని అడిగి రాసుకొంటున్నాడు.

"ఏడిచినట్లే ఉంది. ఇల్లా రాస్తే విచారణ పూర్తి అయ్యేటప్పటికి వీళ్ళ పలకలమీద రాతంతా బ్రహ్మరాతలా అయోమయంగా తయారవుతుంది" అనుకొంది పాప.

పంచాయితీదార్లలో ఒకడి బలపము మరీ కీచుకీచు మంటూ పాపకు చిరాకు కలిగిస్తూంది. చూస్తే ఆ పంచాయితీదారు ఇందాకటి తొండ...భీముడే. పాప నెమ్మదిగా సమయం కనిపెట్టి, భీముడు చూడకుండా, ఉన్నట్లుండి వాడి చేతిలో బలపం గప్‌చిప్‌గా లాగేసి మాయం చేసేసింది. బలపం కనబడకపోయేటప్పటికి భీముడు తెల్లబోయి దిక్కులు చూసి, చివరికి వేలితో పలకమీద రాయటం మొదలుపెట్టాడు. కాని వేలితో రాస్తే ఆ పలకమీద అక్షరమొక్కటి కూడా పడటం లేదు.

"దండనాథా! నేరం చదువు" అంటూ రాజుగారు ఆజ్ఞాపించారు.

కుందేలు సకిలించి ఒక కొమ్ముబూర తీసుకొని మూడుమాట్లు గట్టిగా బాకా ఊదింది. తర్వాత

'శాబాష్!' అని సభను గదమాయించి, నేరం వివరించటం మొదలుపెట్టింది.

"అరకు రాణీగారు, ఆనాడు ప్రొద్దున్న
కజ్జికాయలు చేసి కమ్మగాను;
అరకు జాకీగాడు అవి దొంగతనముగా
ఎత్తుకెళ్ళి వెధవ ఎగిరిపోయె"—

"పంచాయితీదార్లు, తీర్పు చెప్పండి" అన్నాడు అరకు రాజు.

"ఆగండి! ఆగండి! అప్పుడే కాలేదు; ఇంకా చాలా చదవాలి. ఆపైన చాలా తతంగం ఉంది" అని తెల్లకుందేలు ఆత్రపడిగా రాజుగారితో చెప్పింది.

"సరి, అయితే మొదటిసాక్షిని పిలు" అన్నాడు రాజుగారు.

"మొదటిసాక్షి, మొదటిసాక్షి, మొదటిసాక్షి, ఒకటోసారి, రెండోసారి, మూడోసారి" అని అరిచి తెల్లకుందేలు బాకా మూడుమార్లు ఊదింది.

మొదటిసాక్షి వెఱ్ఱివెంగళాయి. ఆ టీ కప్పూ సాసరూ, అల్లాగే చేత్తో పుచ్చుకొని సభలోకి వచ్చాడు. "రాజుగారు క్షమించాలి, ఇక్కడి కేక వినేటప్పటికి నేను టీ తాగటం పూర్తికాలేదు. అందుచేత తాగుతున్నవాటిని తాగుతున్నట్లు పుచ్చుకొని అల్లాగే వచ్చేశాను. క్షమించాలి" అంటూ బోనెక్కాడు.

"తాగటం పూర్తిచేసి ఉండాల్సింది. అసలు టీ

తాగటం ఎప్పుడు మొదలుపెట్టావు?" అని రాజుగారు అడిగారు

వెంగళాయి తొట్టికుందేలువంక చూశాడు. తొట్టికుందేలూ, ఇందాకటి నిద్రమొహం ఎలుకా అద్దగా చెట్టాపట్టా లేసుకొని వెళ్తి వెంగళాయి వెనకాతలే సభలోకి వచ్చారు.

"మార్చి పద్నాలుగో తారీఖున అనుకొంటా నండి" అన్నాడు వెంగళాయి.

"పదిహేనో తారీఖున" అంది తొట్టికుందేలు.

"పదహారో తారీఖున" అంది ఎలుక.

"రాసుకోండి" అన్నాడు రాజు పంచాయితీ దార్ల వంక తిరిగి.

పంచాయితీదార్లు అడావుడిగా మూడు తారీఖులూ వ్రాసుకొని, కూడి, రూపాయిలు అణాలలోకి మార్చి, అంకెలు వేశారు.

# 18

వెట్టి వెంగళాయి నెత్తిన టోపీ ఉంది. "రాజుగారి ముందు సభలో టోపీ ఉండకూడదు, తీసెయ్" అని రాజుగారు వెంగళాయితో అన్నాడు.

"చిత్తమండి, అది నాదికాదండి" అంటూ వెంగళాయి వెట్టినవ్వునవ్వుతూ టోపీ తియ్యకుండా నిలబడ్డాడు.

రాజుగారు పంచాయితీదార్ల వంక తిరిగి "ఎత్తుకొచ్చా డన్నమాట, వ్రాసుకోండి" అన్నాడు. వాళ్ళు రాసుకొంటున్నారు. రాణీగారు కళ్ళజోడు తగిలించి వెంగళాయివంక ఉరిమి చూసింది. వెంగళాయి గజగజా వణికిపోతున్నాడు.

"అల్లా వణక్కుండా సాక్ష్యం చెప్పు" అని రాజుగారు కోపంతో కేకవేశాడు.

వెంగళాయి కాస్త ధైర్యం తెచ్చుకోటానికి టీ తాగుదామనుకొంటూ, మతిపోయి సాసరు పళ్ళెం ముక్క కొరికి మింగేశాడు.

అప్పుడు పాపకు మళ్ళీ తనలో ఏదో విపరీతం జరుగుతున్నట్టు అనిపించింది. తరచి చూసుకుంటే తను మళ్ళీ పెద్దదిగా ఎదగటం ప్రారంభిస్తోంది. ముందు అక్కడినుంచి లేచి బైటికి వెళ్ళిపోదామా అనుకొంది. కాని మళ్ళీ ఆలోచించి "జాగా చాలకపోతే అప్పుడు చూసుకుందాములే" అని అల్లాగే ఉండిపోయింది.

పాపపక్కనే ఉన్న చిట్టిఎలుక, "ఏమిటే! మరీ అల్లా నొక్కేస్తున్నావ్? ఊపిరికూడా ఆడటం లేదు" అంటూ పాపతో కోపంగా అంది.

"నే నేం చేసేది! నేను ఎదిగిపోతున్నాను" అంది పాప.

"ఇదేం నీ ఇల్లు కాదు, ఇష్టమొచ్చినట్టు ఎదగటానికీ, కుంగటానికీ" అంది ఎలుక కోపంతో.

"అనలేదు" అని అరిచింది కుందేలు.

"సరే, అనలేదంటోందిగా - ఆ విషయం వది లేసి చెప్పు" అన్నాడు రాజుగారు. వెంగళాయి మళ్లీ మొదలెట్టేలోపుగా పంచాయితీదార్లలో ఒకరు "పోనీ, వెల్లెలుక ఏమంది?" అని అడిగాడు.

"అది నాకు జ్ఞాపకం లేదండి" అన్నాడు వెంగళాయి.

"జ్ఞాపకం తెచ్చుకొనితీరాలి. లేకపోతే తల కొట్టేస్తా!" అన్నాడు రాజుగారు.

వెంగళాయిచేతిలోని కప్పూ సానరూ, చేతులు వణకటంతో చెయ్యిజారి నేలమీద పడ్డాయి. వెంగళాయి మోకాళ్లమీద పడి, "దయఉంచాలి మహా రాజా! నేను చాలా బీదవాణ్ణి" అంటూ ఏడ్చాడు.

"బీదవాడవా, పేదవాడవా?" అని అడిగాడు రాజుగారు. ఆ ప్రశ్నకు ఒక పందిపిల్ల పకపకా నవ్వటం మొదలుపెట్టింది. రాజభటులు నల్గురు చేరి గభాలున పందిపిల్ల నోరు నొక్కేశారు. అంటే నల్గురూ, ఒక పెద్దగుడ్డ తెరపట్టి, అందులో పంది పిల్లను పడేసి, గట్టిగా ఉండచుట్టేసి, అరుపు ఏమాత్రం వినబడకుండా నొక్కి అవతలకు లాక్కుపోయారు.

"'నోరు నొక్కేయటం' అని ఎన్నిమాట్లో విన్నాగాని ఇప్పటిదాకా చూడలేదే; ఇది భలేగానే ఉంది" అనుకొంది పాప.

ఈ లోపుగా వెంగళాయి సాక్ష్యం పూర్తిఅయి పోయింది. అవతలకు నడిపించారు.

ఇక రెండో సాక్షి జమీందారిణీ వంట మనిషి. వంటమనిషి సభలోకి వచ్చేటప్పటికే అందరికీ, కోరుపెట్టినట్టు తుమ్ములూ దగ్గులూ ఆదేపనిగా రావటం మొదలుపెట్టాయి. వంటమనిషి చేతిలో గొడ్డుకారం డబ్బామూత లేకుండా ఉంది.

"సాక్ష్యం చెప్పు" అన్నారు రాజుగారు.

"నే చెప్పను" అంది వంటమనిషి.

రాజు కంగారుగా తెల్లకుందేలువంక చూశాడు "మహారాజుగారు ఈ సాక్షిని తప్పకుండా విచారించాలి" అన్నది తెల్లకుందేలు.

"సరే, తప్పనిసరి అయితే చేస్తాను"

అంటూ రాజు విచారంగా మొహంపెట్టి వంటలక్కవంక చూసి "కజ్జికాయలు దేంతో చేస్తారు?" అని అడిగాడు.

"మిరపకాయలతో" అంది వంటలక్క.

"నేమ్యాపిండితో" అని ఓ నిద్రమోతు కంఠం వెనకనుంచి వినిపించింది.

రాణీ కోపంతో, "వెర్రి ఎలుకను మెడపట్టుకొని బైటికి గెంటెయ్యండి, నోరు నొక్కేయండ్రా! ముక్కు మీసాలు ఊడపీకేయండి" అంటూ రాణీగారు అరిచింది.

సభఅంతటా ఒక్కసారి కంగారు బయలు దేరింది. తెల్ల ఎలుకను ఎల్లాగో బయటికి తరిమాక మళ్లీ కాస్త సద్దుమణిగింది.

రాజుగారు "అమ్మయ్యా బతికాం," అని, "సరే! తరువాత సాక్షిని పిలు" అని తెల్లకుందేలుతో అన్నాడు. అని రాణీతో నెమ్మదిగా, "ప్రియా, ఈమాటు సాక్షిని నువ్వు విచారించాలి. నాకిప్పటికే తల తిరుగుతూంది" అన్నాడు.

తెల్లకుందేలు తర్వాత సాక్షి పేరుకోసమని కాగితాలు అన్నీ వెదుకుతూంది.

"ఇంతవరకు సాక్ష్యం ఏం వచ్చింది నా మొహం! అయినా, తర్వాతసాక్షి ఎవరో" అను కొంటూ పాప తెల్లబోతూ నిలుచుంది.

తెల్లకుందేలు చివరికి కీచుగొంతుకతో గట్టిగా అరిచింది. "తరువాత సాక్షి పాప". తన పేరు సాక్షు లలో వినేటప్పటికి పాపకు ఒక్కసారి ఆశ్చర్యంవేసింది.

"ప్రెజెంటు" అంటూ బడిలోలాగ ఒక కేక వేస్తూ పాప అదాటున కదిలింది.

ఆ అదాటుడిలో పంచాయితీదారులున్న పెట్టె బోర్ల బొక్కలుగా పడిపోయి అంతా తల్లకిందులుగా పడిపోయారు. పాపకు వాళ్ళను చూస్తే జాలీ, సభలో తాను ఇల్లా చేసినందుకు కంగారూ కలిగాయి. త్వర త్వరగా వాళ్లందరిని లేవనెత్తి పెట్టె సరిచేసి, మళ్ళీ ఎవళ్ళ స్థానాలలో వాళ్లను పెట్టింది.

"పంచాయితీదార్లందరూ తమతమ స్థానాల లోకి సరిగ్గా వచ్చేదాకా విచారణ జరగటానికి వీల్లేదు" అని రాజుగారు కేకవేశాడు.

పాప మళ్లీ పంచాయితీదార్ల వంక చూసింది. ఇందాక అడావుడిలో తొండ భీముడిని తలక్రిందులుగా నిలబెట్టింది. "ఆ, ఈ విచారణకి వాడు ఎల్లాఉంటే మాత్రం ఏమయిందేమిటి?" అనుకొంటూనే భీముడిని మళ్లీ సరిగ్గా నిలబెట్టింది.

పంచాయితీదారులు ఈ భూకంపంనుంచి కాస్త తేరుకొని, మళ్లీ తమ పలకలూ, బలపాలూ కూడ దీసుకొని వ్రాయటం మొదలుపెట్టారు. భీముడు మాత్రం పైకప్పువంకా, వాసాలవంకా చూస్తూ కూర్చున్నాడు.

"ఈ విషయం నీకేం తెలుసును?" అని రాజు గారు పాప నడిగాడు.

"ఏమీా తెలియదు" అంది పాప.

"ఏమీా తెలియదూ?"

"ఏమీా తెలియదు."

అయితే, అది వ్రాసుకోటం చాలా అవస రమే" అన్నాడు రాజు పంచాయితీదార్లవంక తిరిగి.

తెల్లకుందేలు నసుగుతూ ముఖప్రీతిగా నవ్వుతూ, రాజుగారితో, "అనవసరమని మహారాజు గారి అభిప్రాయం" అంది.

రాజు ముఖం చిట్లించుకొని "అనవసరమనే నేను చెప్పిందీని" అని, "అవసరం - అనవసరం," "అనవసరం - అవసరం" - అని పదే పదే అంటూ, రెండు అరచేతుల్లోను రెండు మాటలు తూస్తున్నట్టు చేతులు పైకీ కిందికీ ఆడిస్తున్నాడు.

పంచాయితీదారులు కొందరు 'అవసరం" అనీ, కొందరు అనవసరం" అని వ్రాసుకొన్నారు

పాప వాళ్ల పలకలవైపు చూసి, "నా మొహం, ఏదైనా ఒకటేగా" అంది.

అంతవరకు తన ధోరణిలో తానున్న రాజుగారు పాపను మొదటిసారి పరకాయించి చూశాడు. అప్పటికప్పుడే పాప చాలా పొడుగు ఎదిగింది.

రాజుగారు వెంటనే "42 వ రూల్ ప్రకారం, ఓ మైలుకన్నా ఎత్తున్న వాళ్లంతా సభలోంచి వెళ్లిపోవాలి," అని కేక వేశాడు.

అంతా పాపవంక చూడటం మొదలుపెట్టారు.

"నేనేం మైలుపొడుగులేను" అంది పాప.

"ఉన్నావు" అన్నాడు రాజుగారు.

"ఒకటేమిటి, రెండుమైళ్లు పొడుగుంది' అని రాణీ అరిచింది.

"ఏమయినా, నేను బైటికి వెళ్లేదలేదు అదికాకుండా, ఆ రూలు ఇప్పటికిప్పుడు నువ్వు కల్పించావు. అది నప్పదు" అంది పా

"న్యాయశాస్త్రంలో మొదటి రూలే అది" అన్నాడు రాజు.

"అయితే, ఒకటవ రూలు అవాలిగాని, నల్భై రెం డెల్లా అవుతుంది? అబద్ధం" అంది పాప.

"పంచాయితీదార్లూ, తీర్పు చెప్పండి" అన్నాడు రాజుగారు.

తెల్లకుందేలు ఆదావుడిగా, "ఆగండి, ఆగండి మహారాజా. ఇంకా బోలెడు సాక్ష్యం ఉంది. ఇదిగో ఈ కాగితం ఒకటి ఇప్పుడే దొరికింది" అంది.

"ఏ ముం దా కాగితంలో?" అని అడిగింది రాణి.

"చిత్తమండి! నే నింకా చూడలేదు. ఇప్పుడే మడత విప్పుతున్నాను. ఎవళ్లో ఎవళ్లకో వ్రాసిన ఉత్తరంలాగుందండి" అంది కుందేలు.

"అంతే అయిఉండాలి. ఎవళ్లకీ రాయని ఉత్తరం అంటూ ఎక్కడా ఉండదుగా!" అన్నాడు రాజుగారు.

"ఎవళ్ళపేర వ్రాసిఉంది?" అని పంచాయితీదారు లడిగారు.

"పైన ఎవరిపేరూ ఏమీ వ్రాయలేదు—అదీ కాకుండా ఉత్తరంకూడా పద్యాలలో వ్రాసి ఉంది."

"ముద్దాయిదస్తూరీలోనే ఉందా?" అని మరో పంచాయితీదారు అడిగాడు.

"అదే గమ్మత్తు! ముద్దాయిదస్తూరీలో ఉన్నట్టులేదు." పంచాయితీదార్లు తెల్లబోయారు.

"అయితే, దొంగ ఇంకోళ్ళ దస్తూరీ కాపీ చేసి ఉండాలి" అన్నాడు రాజుగారు. పంచాయితీదార్లు కాస్త తెలివిన బడ్డారు.

"మహారాజా! మహారాజా! అది నేను వ్రాయ లేదండి, ఇంకా కావలిస్తే చూడండి, అడుగుని సంతకంకూడా ఏమీలేదండి" అని మొఱపెట్టు కున్నాడు అరకుజాకీ.

"సంతకం లేదంటే మోసం చేద్దామని వ్రాసి ఉంటావు. న్యాయంగా వ్రాసేవాడివైతే సంతకం ఎందుకు చేయవు? కాబట్టి నీ తప్పే మరీ బాగా ఋజువౌతోంది" అని రాజు సభవంక సగర్వంగా తిరిగి చూశాడు. రాజుగారి తెలివితేటలకు సభ్యులు చప్పట్లు చరిచారు.

"ఇంకేం! జాకీగాడిమీద నేరం ఋజువయింది" అంది రాణి.

పాపకు ఈ అన్యాయం చూస్తే కోపంవచ్చింది.

"ఏం ఋజువవలా! అసలు కాగితంలో ఏముందో అన్నా చూడకుండా, ఏమి టా తీర్పు?" అని గట్టిగా గదమాయించింది పాప. తెల్లకుందేలు కాగితంమీద ఉన్న పద్యాలు చదవటం మొదలు పెట్టింది.

ఆకతాయి కోతులన్ని
ఊక పోగు చేసికొంటె
కాకిముక్క చుట్టు చీ
కాకు పరిచెను...
ఒకటి తెచ్చి, రెండు ఇచ్చి,
ఒకటి రెండు మూడు తెచ్చి,
నాలుగు మళ్లీ వనక కిస్తె
మూడె నింతకూ"

"ఇంకేం? ఈ సాక్ష్యంతో నేరం ఋజువై పోయింది" అన్నాడు రాజుగారు. పాప అప్పటికప్పుడే చాల పొడుగయిపోయింది. అందుచేత ఎవళ్లన్నా భయం లేకుండా పోయింది.

"నా మొహంలాగుంది. ఏమీ కాలే, అర్థం పర్థంలేని పద్యాలు—ఏమిటా పద్యాలు? అసలు ముందు దాని అర్థం ఏమిటో చెప్పండి, నలుసంత కూడా అందులో ఏమీ అర్థం లేదు. ఊ!" అంది.

పంచాయితీదారులంతా "నలుసంతకూడా అర్థం లేదని నమ్ముతూంది" అని వ్రాసుకుంటున్నారు.

"సరే, అర్థమే లేకపోతే బ్రతికిపోయాము. అర్థం ఏమిటా అని తలకాయ పగలగొట్టుకో అక్క్లేదు" అన్నాడు రాజుగారు. "అయినా చూద్దాం" అని కాగితం తిప్పిచూస్తూ—

"నువ్వు ఊక తెచ్చావా?" అని జాకీగాడిని అడిగాడు.

"నేను కోతిమూకనా మహాప్రభూ?" అన్నాడు జాకీ.

"కోతివెధవ్వైతే, అంతవరకూ నిజమే. తర్వాత చూద్దాం. ఒకటితెచ్చి, రెండుతెచ్చి—ఓ! ఎందుకూ, ఇది కజ్జికాయల విషయమే" అన్నాడు గొప్పగా రాజుగారు.

"కాని అన్నీ ఇచ్చేశాడని పద్యంలో ఉందిగా" అంది పాప.

"అవునూ! అవిగో అక్కడ లేవూ?" అంటూ రాజుగారు, తనే నెగ్గిన సంతోషంతో కజ్జికాయల వంక చూపించాడు.

"సరే, పంచాయితీదార్లు తీర్పు చెప్పండి" అన్నాడు రాజుగారు.

"కాదు. తీర్పు తర్వాత చెప్పవచ్చు, ముందు శిక్ష చెప్పండి" అని అరిచింది రాణీ. పాప కోపంతో "ఏడిశినట్టే ఉంది. తీర్పు చెప్పకుండా శిక్ష ఏమిటి?" అని అరిచింది.

"నోర్మూయ్!" అని గదమాయించింది రాణీ.

పాప కూడా కోపంతో "నువ్వే నోర్మూయ్" అని కేకవేసింది.

"ముందు దీని తల కొట్టేయండి" అని అరిచింది రాణీ.

పాప అప్పటి కప్పుడే తన మామూలుఎత్తుకు ఎదిగిపోయింది.

"ఏడిశావులే, నువ్వంటే ఎవళ్లకీ లెఖ్ఖ! మీరంతా వట్టి పేకముక్కలే! అంతే" అంది.

పాప ఆమాట అనేటప్పటికి, పేకముక్కలన్నీ ఎగురుకొంటూ పాపమీదికి వచ్చిపడ్డాయి. పాప సగం కోపంతోటీ సగం భయంతోటీ ఒక్క కేకవేసి, వాట్లను కొట్టేందుకు చేతులు విసుస్తూ కళ్లు తెరిచింది.

* * * *

తీరా చూస్తే తను తోటలో దారువుపక్కన చెట్టునీడను అక్కయ్య ఒళ్లో తల పెట్టుకొని పడుకొని ఉంది. చెట్టునుంచి రాలిన ఎండుటాకులు కొన్ని పాప మొహాంమీదుగా ఎగురుతున్నాయి.

"పాపా! లే అమ్మా! ఇంతసేపు నిద్రపోయావేం?" అంటూ వాళ్ల అక్కయ్య పాపను లేపి కూర్చోపెట్టింది. పాప తన కలఅంతా అక్కయ్యతో చెప్పింది. అక్కయ్య ఆ కల చాలా బాగుందని, "పద, ఇంట్లోకి పద. ఫలాహారానికి వేళ అయింది" అని పాపను పంపించింది. పాప సంతోషంతో పరుగెత్తు కొంటూ ఇంట్లోకి వెళ్లిపోయింది. "ఈ అమాయిక సంతోషమే, హాయే మా పాపకు జీవితంపొడుగునా ఉండాలి" అని అక్కయ్య దీవిస్తూ పాపవెంట వెళ్లింది.

## సంపూర్ణము